## అధ జ్యోతిశ్శాస్త్ర ప్రశంసా

జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రత్యక్షమపి గోపితం
చంద్రార్కౌ సాక్షిణౌతత్ర శ్రాతస్మార్తాది సాధనం

### అధ దైవజ్ఞలక్షణం

అద్వేషీ నిత్యసంతోషీ గణితాగమ పారగః
ముహూర్త గుణ దోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్
శాంతశ్చామృత వాక్సౌమ్యస్త్రికాలజ్ఞో జితేంద్రియః
నాత్యకర్మరతో యోవై స దైవజ్ఞః పరికీర్తితాః

### అబ్దాది కృత్యం

బ్రాహ్మీముహూర్తే ఉత్థాయ దంతధావనపూర్వకం
స్నానాది విధివత్కుర్యా ద్వర్ణాచారాను సారతః
ఆబ్దాదౌ బంధు సంయుక్తో మంగళస్నానమాచరేత్
వస్త్రైరాభరణైర్దేహ మలంకృత్యా తత శ్శుచిః
ఉదజ్ముఖః ప్రాజ్ముఖోవాదైవజ్ఞస్య తు సన్నిధౌ
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞం బ్రాహ్మణాన్గురూన్
సంపూజ్యా వస్త్రఫలం సాంగోపాంగం యధాక్రమమ్
వికాసవదనో ధీమాన్ సంయజ్ఞాత్వాఫలం లభేత్
అబ్దాదౌ నిమ్బకుసుమం శర్కారామ్ల ఘృతైర్యుతమ్
మరీచ గుడ సంయుక్తం భక్షయేత్పూర్వ యామకే
ఆయుశ్శ్రీర్లభ్యతే వర్షే మనోవ్యాధిశ్చ నశ్యతి
యద్వర్షాదౌ నిమ్బకుసుమం శర్కరామ్లా ఘృతైర్యుతమ్
భక్షితం పూర్వయామే స్యాత్తద్వర్షం సౌఖ్యదాయకం
సాంగోపాంగం వత్సరస్యబ్రహ్మణో జన్మతఃఫలమ్
యే శ్రుణ్వంతి క్రతుఫలం తే లభంతి న సంశయః

## ఒక్క మాట

భారతదేశపు అక్షాంశ రేఖాంశవములను ప్రామాణికంగా తీసికొని తిథ్యాదికములు, లగ్నాంత కాలములు, గుణింపబడిన పంచాంగమిది.

-ఇండియన్ మెటీరియాలాజికల్ డిపార్ట్‌మెంట్, పొజిషనల్ ఆస్ట్రానమీ సెంటర్ - న్యూఢిల్లీ వారు అనుసరించుచున్న ప్రామాణిక సూత్రాల ఆధారంతో గుణించబడిన పంచాంగమిది.

- శుభ ముహూర్త నిర్ణయమునకు, జాతకము మరియు ప్రశ్న భాగమునకు సులభముగా నుండునట్లు దినవారీ తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలు, అమృత, వర్జ్య, దుర్ముహూర్తములు ముద్రించబడిన పంచాంగం

- దీనిని ఆంధ్రదేశమునందందరు ఏ విధమైన సంస్కరణలు లేకుండా యధాతధంగా స్వీకరించవచ్చును. మరియు చేతి గడియారపు టైము (ఐ. ఎస్. టి) తో అనుసరించవచ్చును.

- ఇంతే గాక ఇందు మేమిచ్చిన సంస్కార పట్టికలను అనుసరించినచో మన దేశమునందలి ఏ ప్రాంతమునకైనను సమయములను సరిచేసి కొనవచ్చును.

ఈ విషయములన్నిటిని జ్యోతిషశాస్త్రాభిమానులెల్లరకు సవినయముగా తెలియజేసికొనుచున్నాము.

ఇట్లు

పంచాంగ కర్తలు

## పంచాంగాన్ని ఉపయోగించడము

ఈ పంచాంగం జ్యోతిష శాస్త్రజ్ఞులకు, జ్యోతిష శాస్త్ర ప్రవేశకులకు మరియు పంచాంగం మాత్రమే ఉపయోగించే సామాన్యులకు, అందుబాటులో ఉండడమే గాక ఉపయోగకరంగా ఉండడం మా ఉద్దేశ్యము.

మా కృషికి ఇతోధిక ప్రోత్సాహమిస్తున్న అందరికీ మేమెంతో ఋణపడి ఉన్నాం. అందుకే అందరికి కృతజ్ఞతాభివందనములనర్పిస్తున్నాం.

మన పంచాంగాన్ని చదివిన చాలా మంది మిత్రులు పంచాంగాన్ని ఎలా ఉపయోగించాలో తెలియజేయమని కోరియున్నారు. కావున ఈ పంచాంగంలో ఆ విషయాల్ని తెలియజేస్తున్నాం.

ఈ మధ్యకాలంలో జ్యోతిష శాస్త్రమునకు ఇంత ప్రాచుర్యం ఎందుకు వస్తున్నది? అనే విషయాన్ని పరిశీలించాలి.

మన అప్పటి రాష్ట్రముఖ్యమంత్రి మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు 19 87లో జ్యోతిషంలో సర్టిఫికేట్, డిప్లమా, పిజి డిప్లమా, ఎం.ఏ జ్యోతిషం కోర్సులను తెలుగు యూనివర్సిటీలో ప్రవేశపెట్టారు. గత ఆరు సంవత్సరాల క్రిందట జ్యోతిష శాస్త్రమును దూరవిద్యా అధ్యయ నాంశంగా పోస్టు గ్రాడ్యుయేషన్ స్థాయిలో ప్రవేశ పెట్టారు.

ఇంతే గాక యూనివర్సిటీ స్థాయిలలో జ్యోతిష శాస్త్రమును పాఠ్యాంశంగా ఉంచాలని కేంద్రప్రభుత్వం వారు నిర్ణయించడంతో విద్యాధికుల్లో ఈ శాస్త్రమును గూర్చిన అవగాహన జరుగుతూవుంది.

భావితరాలకు జ్యోతిష శాస్త్రమును కులమత భేద రహితంగా బోధించడమే మా ప్రధానాశయము. అందుకే శ్రీ గాయత్రీ జ్యోతిష విజ్ఞాన సంస్థ ద్వారా విద్యార్థి దశనుండే, జ్యోతిషశాస్త్ర పరీక్షలను నిర్వహిస్తూ, కరస్పాండెన్స్ కోర్సుద్వారా విద్యార్థులకు వారి ఇండ్లవద్దకు పాఠాలను పంపుతున్నాం.

జ్యోతిష శాస్త్రమును సామాన్యుని స్థాయికి అందుబాటులో ఉంచడం మా లక్ష్యము.

**ఇక పంచాంగాన్ని ఉపయోగించుకోవడం ఎలానో తెలిసికుందాం.**

పంచాంగం అంటే ఐదు అంగములు కలది అని అర్థం. ఈ పంచాంగం అనేది జ్యోతిషశాస్త్రజ్ఞులకే గాక జ్యోతిషశాస్త్ర అభ్యాసకులకు మరియు సామాన్యులకు గూడ కరదీపిక వంటిది.

ఇందులో తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలేగాక అనేక ఉపయుక్తాంశాలు, శిశు జననసంబంధిత అంశాలు, వివాహ సంబంధిత విషయాలు, యాత్రా ప్రకరణము, స్త్రీలకు సంబంధించినఅనేక విషయాలు, విద్యా ముహూర్తాలు, వ్యాపార సంబంధిత ముహూర్తాలు, వ్యవసాయ విషయాలు, పశు సంబంధిత ముహూర్తాలు, మరణ సంబంధిత అంశాలు, కార్తుల ప్రవేశము (వాతావరణ సంబంధితాంశం) రాశి ఫలాలు, వివాహ, వ్యాపార, అన్నప్రాశన మొదలైనవి శుభ ముహూర్తాలు ఇంకావెన్నో ఇందులో సమగ్రంగా ఏర్చి కూర్చాము.

వీటిని మీరు ఉపయోగించుకునే ముందు, అన్నింటికీ అత్యంత ప్రధానమైన తారాబలం చూడడం తెలిసికోవాలి.

మీరెపుడైనా శుభముహూర్త నిర్ణయం కొరకు పురోహితుని వద్దకు వెళ్ళి ఉంటే మీకీ విషయం గుర్తు ఉండే ఉంటుంది. శ్రీవారు – ముందు మీ పేరు అడుగుతారు. లేదా జన్మ నక్షత్రం అడుగుతారు. జన్మ నక్షత్రం తెలియని వారు వారి పేరు చెబితే వారి నామ నక్షత్రాన్ని నిర్ణయిస్తారు.

జన్మ లేదా నామ నక్షత్ర నిర్ణయం ( ఈ విషయం మన పంచాంగంలో రాశి కూటాది చక్రం అనేచోట ఉన్నది గుర్తించండి) జరిగిన తరువాత ఆ నక్షత్రం నుండి నిర్ణయింపబడిన ముహూర్తపు రోజునగల నక్షత్రం వరకు లెక్కించి ఇది వ్యక్తిగతంగా మీకు అనుకూల ముహూర్తమో, కాదో నిశ్చయించడమే తారా బలాన్ని లెక్కించడం అంటే–

ఈ తారలు తొమ్మిది. అవి 1. జన్మతార, 2. సంపత్తార, 3. విపత్తార, 4. క్షేమతార, 5. ప్రత్యక్తార, 6. సాధనతార, 7. నైధనతార, 8. మిత్రతార, 9. పరమమిత్రతార.

వీనిలో – 2, 4, 6, 8, 9 తారలు మంచివి



1, 3, 5, 7 తారలు మంచివి కావు.

మీ జన్మనక్షత్రం నుండి నిత్యనక్షత్రం వరకు లెక్కిస్తే వచ్చిన సంఖ్యను 9 చే భాగిస్తే శేషంగా మిగిలిన సంఖ్యను పరిగణనలోకి తీసికోవాలి. ఆ సంఖ్య 2, 4, 6, 8, 9 అయితే మంచిది.

ఉదాహరణ:–

పెదకాపు అనే వ్యక్తికి వివాహ ముహూర్తమో; వ్యాపారముహూర్తమో, ప్రయాణ ముహూర్తమో కావాలి? అని అనుకొండి మొదట వారి పేరును బట్టి నామ నక్షత్ర నిర్ణయం చేయాలి.

లేదా జన్మ నక్షత్రం తెలిసి ఉంటే ఇంకా మంచిది. పెదకాపు ( పే, పో, రా, రి – చిత్త) ఇలా ఎవరి పేరుకైనా నామ నక్షత్రాన్ని తెలిసి కోవడం రాశి కూటాది చక్రం అనే చోట పెదకాపుగారి నామ నక్షత్రం చిత్త తదుపరి ఈ సంవత్సరంలో ఉండే శుభ ముహూర్తాలన్నీ ఒక చోట వ్రాయబడియున్నవి.

వానిలో కావలసిన తేదీకి, ఇటు, అటు, కొన్ని ముహూర్తాలను ముందుగా ఎన్నుకొని, ఆ ముహూర్త నిర్ణయపు దినాల్లో గల నక్షత్రాన్ని ఒక ప్రక్కన వ్రాసి ఉంచుకోండి. వానిలో

ఉదా: రేవతి, రోహిణి, మృగశిర, – ఇలా ఉన్నవి అని అనుకోండి.

పెదకాపు – అనే వ్యక్తికి ఈ నక్షత్రాలలో ఏ నక్షత్రం ఉండే రోజు మంచిది? అనేది తెలుసుకోవాలి. పెదకాపు – నామ నక్షత్రం – చిత్త.

ముహూర్త నక్షత్రాలు – రేవతి, రోహిణి, మృగశిర – అని అనుకున్నాం.
చిత్త నుండి రేవతి వరకు లెక్కించాలి – 14 వ నక్షత్రం
చిత్త నుండి రోహిణి వరకు లెక్కించాలి – 18 వ నక్షత్రం
చిత్త నుండి మృగశిర వరకు లెక్కించాలి – 19 వ నక్షత్రం
పై నక్షత్ర సంఖ్యను 9 చే భాగించాలి
చిత్త నుండి రేవతి 14 దీనిని 9 చే భాగించాలి.
[illegible] నక్షత్రం కలిగిన ముహూర్తపు రోజు 9)14(1
9
5

శేషం – 5 – ప్రత్యక్తార ఇది పెదకాపునకు మంచిది కాదు. ఎందు వల్లంటే 1, 3, 5, 7 తారలు మంచివి కావు .

ఇక రోహిణి నక్షత్రం కలిగిన ముహూర్తపు రోజు విషయం పరిశీలిద్దాం !
చిత్త నుండి రోహిణి వరకు – 18 వ నక్షత్రం
దీనిని 9 చే భాగించాలి – 18/9 శేషం సున్న

శేషం సున్న వచ్చినపుడు ఎపుడైనా 9 గానే పరిగణించాలి. ఇది పెదకాపునకు మంచి ముహూర్తం . ఎందు వల్లంటే 2, 4, 6, 9 తారలు మంచివి.

అలాగే మృగశిరా నక్షత్రం కలిగిన ముహూర్తపు రోజును పరిశీలిద్దాం
చిత్త నుండి మృగశిర వరకు – 19 వ నక్షత్రం
దీనిని 9 చే భాగించాలి. – 19 / 9 = శేషం - 1
1, 3, 5, 7 తారలు మంచివి కాదు. అందు వల్ల ఈ రోజు మంచిది కాదు.

మీరు పురోహితుని వద్దకు వెళ్ళినపుడు –

చిటికిన వ్రేలి నుండి మధ్య వ్రేలి కణుపుల చివరి వరకు లెక్కించేది ఇదే.

అయితే మీరు ఇలా మీకు కావలసిన పేరుకు సరిపడిన ముహూర్తాలను తెలిసి కోగలుగుతున్నారే గానీ – ఆ ముహూర్తాలలో ఏది ఎంత శాతం మంచిది? అనే విషయం తెలుసుకోవడానికి తప్పక దైవజ్ఞులను కలిసి కోవాల్సిందే!

లక్షల విలువ జేసే ఇల్లు కట్టుకునే ముందు రు 100/– ల విలువైన వాస్తు శాస్త్ర గ్రంథాన్ని కొని, చదివి ఇష్టం వచ్చినట్లు ఈశాన్యం పెంచుకొని ఇల్లు కట్టుకోవడం ఎంత ప్రమాదమో తెలుసు గదా! ఇదీ అంతే ! ఎందువల్లంటే –

శాస్త్రాలు అనేవి అభ్యసనానికి అవసరమైనవి. ఈ అభ్యసన అనేది గురువు ప్రత్యక్షంలోనో, పరోక్షంలోనో కొంతకాలం జరగాలి.

తదుపరి గురువు పర్యవేక్షణలో అమలు జరపాలి. నాలుగైదు సంవత్సరాలు మెడిసన్ చదివిన విద్యార్థి చివరి సంవత్సరం హౌస్‌సర్జన్ చేసినట్లుగా ఈ అభ్యసనం జరగాలి. అలాకాక, శాస్త్రమును చదివి యథాతథంగా అమలు పరుచుకుంటూ పోతే కొన్ని అనర్థాలు తప్పవు.

**ఈ పంచాంగంలో అనుసరించిన శాస్త్రీయ పద్ధతులు, సులువు పద్ధతులు**

1. ఈ పంచాంగం కేలండర్ రిఫార్మ్ కమిటీ వారు నిర్దేశించిన గ్రహగతుల నిర్ణయ విధానాన్ని అనుసరించి, దృక్సిద్ధాంత పద్ధతిలో వ్రాయబడివున్నది.

2. జ్యోతిష శాస్త్ర అభ్యాసకులు ఎక్కువ శ్రమ పడకుండా పంచాంగంలో తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలనే పంచాంగాలను తెలియజేయడం వల్ల, అధ్యయనము చాలా సులభం.

3. ఇందు తిథి, నక్షత్ర, యోగ, కరణముల అంత్యాన్ని , అమృత, వర్జ్య, దుర్ముహూర్తముల ఆద్యంతములను ఇవ్వడం జరిగింది.

4. ఉపయుక్తకర అంశాలు అనే శీర్షికలో -

ఏ శుభ ముహూర్తాలకు ఏయే లగ్నాలు, నక్షత్రాలు సరిపడతాయో వివరంగా ఒక చోట ఉంచాము. మీరు పంచాంగం కొనడంతోనే సరిపోలేదు - ఒక్కసారి ఇందులో ఏ యే పుటలలో ఏ యే అంశాలున్నాయో నిశితంగా పరిశీలించండి. తదుపరి వాటిని ఎలా అనుసరించాలో ప్రయత్నించండి. మేము ఎల్లవేళలా మీకు సహకరించడానికి ప్రయత్నిస్తాం.

ఈ జ్యోతిష శాస్త్ర పరిశీలన, అభ్యాసం అనేవి ఏ ఒక్క రోజులోనో లేక ఒక గంటలోనో వచ్చేవి గావు. నిరంతర పరిశీలన, అభ్యసన, ఆచరణ కావాలి. అందుకే ఈ శాస్త్రమును భావి తరంలోని విద్యార్థులకు అందుబాటులో ఉంచాలని మా అభిలాష.

**అందుకొరకు పరీక్షలను పోస్టల్ కోచింగ్ ద్వారా నేర్పిస్తున్నాం.**

| | |
|---|---|
| జ్యోతిష ప్రథమ | (10 వ తరగతి స్థాయి) |
| జ్యోతిష మధ్యమ | ( ఇంటర్మీడియట్ స్థాయి) |
| జ్యోతిర్విశారద | (డిగ్రీస్థాయి) |
| జ్యోతిర్విద్వాన్ | (పోస్టు గ్రాడ్యుయేషన్ స్థాయి) |

పాఠాలన్నీ మీకుచేరినతరువాత ప్రశ్నపత్రాలను మీ ఇంటికే చేరుస్తాం., మీ జవాబులను మదింపుచేసి శ్రేణీ పద్ధతిలో పరీక్షా ఫలితాలను తెలియ జేస్తాం.

మీ బిడ్డలేగాదు - వయసుతో నిమిత్తం లేకుండా ఈ పరీక్షలకు ఎవరైనా సిద్ధపడవచ్చు. మీరైనా సరే!

చివరగా ఒక విన్నపం ---- ఈ జ్యోతిషశాస్త్రం భారతీయ జన జీవితంతో సమ్మిళితమైపోయివున్నది. బిడ్డ పుట్టినప్పటి నుండి మన చివరి దినాల వరకూ ఈ శాస్త్రమును ఆశ్రయించక తప్పడం లేదు.

ఇంతటి ప్రాధాన్యత కలిగిన ఈ శాస్త్రమును సప్రమాణమైన శాస్త్రీయ అవగాహన లేకుండా అనుసరించడం అవ్యక్తం కాదంటారా?

అందుకే శాస్త్ర అధ్యయనానికి సంబంధించిన అన్ని విషయాలకు మాతో సంప్రదించండి-


## శ్రీగాయత్రీ జ్యోతిష విజ్ఞాన సంస్థ

**34, మైత్రీపురం, కర్మన్‌ఘాట్, హైదరాబాద్,**
**ఫోన్ 040 - 55604425, సెల్ - 9440938113**


**కొన్ని ముఖ్య సూచనలు**

పోస్టు ద్వారా మాతో సంప్రదించవలసిన వారు తప్పక రిప్లైకార్డు జతయాలి.

ఫోను ద్వారా సంప్రదించవలసినవారు ఆదివారం తప్ప మిగిలిన రోజుల్లో మధ్యాహ్నం 11 గంటలనుండి సాయంకాలం 5 గంటల వరకూ.

అపాయింట్ మెంట్ లేకుండా నేరుగా మా వద్దకు వస్తే సమయ అభావం వలన మిమ్ములను కలుసుకొనలేకపోవచ్చును.

ఇట్లు
పంచాంగ కర్త



| | | | | |
|---|---|---|---|---|
| 15 | త్రయో | గురు | ఉషా | విద్యారంభ, ఉపనయన, గృహారంభ, దేవతా ప్రతిష్ఠాదులకు మీన ఉ 8.27 ని.లు |

**ఫాల్గుణ మాసము**

| | | | | |
|---|---|---|---|---|
| 21 | చవి | బుధ | రేవ | విద్యారంభ, కర్ణవేధ, ఉపనయన, దేవతా ప్రతిష్ఠాదులకు మీన ఉ 08.03 ని.లు , ల.చ |
| | | | అశ్వ | గృహ ప్రవేశాదులకు కన్య రా 8.31, తుల రా 11.21 ని.లు, |
| 22 | పంచ | గురు | అశ్వ | విద్యారంభ, ఉపనయన, వివాహ, దేవతాప్రతిష్ఠా దులకు చోర మీన ఉ 7.59 ని.లు , ★ |
| 24 | అష్ట | శని | రోహి | గృహ ప్రవేశ, వివాహాదులకు తుల రా 11.10. పైవాటికి కన్య రా 8.20 ని.లు ★ |
| 25 | నవ | ఆది | రోహి | ఉపనయన, గృహారంభ, గృహప్రవేశ, దేవతా ప్రతిష్ఠాదులకు వృష ఉ 11.42ని.లు |
| | | | మృగ | వివాహ, గృహప్రవేశాదులకు కన్య రా 8.15 ని. తుల రా 11.06 ని.లు★ |
| 26 | దశ | సోమ | మృగ | అన్న ప్రాశన, విద్యారంభ, ఉపనయన వివాహాదులకు మీన ఉ 7.43 ని.లు, మేష ఉ 10.11 ని.లు, వృష ఉ 11.38ని.లు. |
| 28 | ద్వాద | బుధ | పున | ఉపనయన, గృహారంభ, దేవతా ప్రతిష్ఠాదులకు మీన ఉ 7.36 ని.లు, వివాహాదులకు వృష ఉ 11.30 ని.లు. |
| | | | పుష్య | గృహ ప్రవేశాదులకు కన్య రా 08.03 ని.లు |

**మార్చి నెల**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | త్రయో | గురు | పుష్య | అన్నప్రాశన, ఉపనయన, గృహారంభాదులకు మీన ఉ 7.32 ని.లు, వృష ఉ 11.27ని.లు |
| 2 | చతు | శుక్ర | మఖ | గృహ ప్రవేశ, వివాహ, గర్భాధానాదులకు కన్య రా 7.54 ని.లు, తుల రా 10.47 ని.లు, |
| 3 | పూర్ణి | శని | మఖ | వివాహాదులకు మేష ఉ 9.53 ని.లు , గృహారంభ, గృహప్రవేశ, వివాహాదులకు వృష ఉ 11.19 ని.లు . |
| 5 | విది | సోమ | ఉత్తర | గృహ ప్రవేశ, దేవతా ప్రతిష్ఠాదులకు మీన ఉ 7.16 ని.లు, వృష ఉ 11.11 ని.లు |
| 7 | తది | బుధ | చిత్త | ఉపనయనాదులకు మీన ఉ 7.08 ని.లు, |
| | | | చిత్త | గృహ ప్రవేశ, వివాహ, గర్భాధానాదులకు కన్య రా 7.34 ని.లు, |
| | | | స్వాతి | గృహ ప్రవేశ, వివాహాదులకు కన్య రా 7.30 ని. గర్భాధానాదులకు తుల 10.23 ని.లు,★ వృశ్చి రా 11.19 ని.లు.★ |
| 10 | షష్ఠి | శని | అనూ | అన్నప్రాశనోపనయనాదులు వృష ఉ 10.52 ★ వివాహ గర్భాధానాదులకు వృశ్చి రా 11.11★ |
| 11 | సప్త | ఆది | అనూ | గృహారంభ, వివాహాదులకు మీన ఉ 6.52 ని. వృష ఉ 10.48 ని.లు ★ |
| 12 | అష్ట | సోమ | మూల | గృహ ప్రవేశాదులకు కన్య రా 7.14 ని.లు, తుల రా 10.07 ని.లు. |

మంగళంమహత్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



## ద్విపుష్కర - త్రిపుష్కర యోగములు

ద్విపుష్కరయోగము :- ఆది, మంగళ, శనివారములు; విదియ, సప్తమి, ద్వాదశి తిథులు; మృగశిర చిత్త, ధనిష్ట నక్షత్రాలు కలసినపుడు ద్విపుష్కరయోగం అనబడును. ఈ రోజులలో జరిగిన మృతి వస్తు లాభనష్టాలు మొదలగు పనులు మరలా జరుగును.

త్రిపుష్కర యోగము:- ఆది, మంగళ, శనివారములు; విదియ, సప్తమి, ద్వాదశి తిథులు; కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రాలు కలసిన త్రిపుష్కరయోగం అనబడును. ఈ రోజులలో జరిగిన మృతి వస్తు లాభనష్టాలు మొదలగు పనులు మరల మరలా జరుగును.

## గ్రహములకు మూర్తినిర్ణయము

రవ్యాది గ్రహములు ఒక రాశినుండి మరియొక రాశికి మారునపుడు ప్రవేశరాశినుండి నిత్యనక్షత్ర రాశివరకూ లెక్కించినపుడు 1 - 6 - 11 రాసులైన సువర్ణమూర్తులు, 2 - 5 - 9 రాసులైన రజితమూర్తులు, 3 - 7 - 10 రాసులైన తామ్రమూర్తులు, 4 - 8 - 12 రాసులైన లోహమూర్తులు అగుదురు.

గోచారరత్యా దుష్టస్థానములందున్న అశుభ గ్రహములుకూడా సువర్ణ, రజితమూర్తులైన శుభ ఫలితములనిచ్చెదరు. శుభస్థానములందున్న శుభగ్రహములైనా తామ్ర, లోహమూర్తులైన అశుభ ఫలితములనే ఇచ్చెదరు.

## పండితులకు విన్నపము

కాలము అత్యంత పవిత్రమైనది. అందుకే కాలమును పరబ్రహ్మమని చెపుతారు. భగవంతుడు కాలస్వరూపుడు. ఆ కాలముపై ఆధారపడిన శాస్త్రమును జ్యోతిశ్శాస్త్ర మంటారు. జ్యోతిశ్శాస్త్రమును జీవిపుటుటక నుండి అంత్యకాలము వరకూ ఉపయోగిస్తూనే ఉంటారు. జ్యోతిశ్శాస్త్రమంటే ఆకాశములోని జ్యోతులయొక్క (నక్షత్రకాంతులయొక్క) కాంతి విశ్లేషణా ఫలితములను తెలుపుటయే. అట్టి కాంతి తరంగముల ఫలితములను విశ్లేషించు శాస్త్రమే జ్యోతిష శాస్త్రము. ఈ శాస్త్రము నందు ప్రామాణికత అన్నిశాస్త్రములవలెనే యున్నది. ఏ శాస్త్రమునందైనను సఫలత ఎనుబది శాస్త్రముమాత్రమేయుండును. అదే విధముగా జ్యోతిషశాస్త్రమునందు కూడా అంతకంటే ఎక్కువ శాతము ఫలితములు కనిపించును. ప్రఖ్యాతుడైన శస్త్ర చికిత్సకారుడు(డాక్టరు) చేసిన ఆపరేషన్లలో కూడ ఎనుబదిశాతముమాత్రమే ఫలితములుండుట వారివాటలద్వారా తేటతెల్లమగును. ప్రతి ఆపరేషనుకు ముందుకూడా వ్యక్తి బంధువులచేత వ్యక్తి జీవికగురించి ఒప్పంద పత్రము వ్రాయించుకొందురు. వైద్యశాస్త్రమున లోపము లేనిచో ఈ ఒప్పంద పత్రము అక్కరలేదుకదా ! అటులనే అన్నిశాస్త్రములును. ఐనను శాస్త్ర పరిజ్ఞానమునుది వ్యక్తియొక్క శాస్త్ర పరిణతిపై ఆధారపడియుండును. ప్రస్తుత కాలములో శాస్త్ర పరిణతి లేని పండితులు చాలమంది యున్నారు. ముహూర్తముఅంటే ఏమిటో తెలియనివారు, పురోహితులకొరకుమాత్రమే ఎక్కువ ముహూర్తములు వ్రాసే పంచాంగ కర్తలు, పృచ్ఛకుని మెప్పుకొరకు ముహూర్తములు నిర్ణయించువారు అధికముగా కనిపించుచున్నారు. ఈ సాంప్రదాయముమారి జ్యోతిశ్శాస్త్రమును సరైన పద్ధతిలో చదివి పురమునకు హితముచేయువారు పురోహితులు అనుఅర్ధమును సార్ధకము చేసి సాధికారమైన జ్యోతిషశాస్త్రపు ఔన్నత్యమును కాపాడి కాలముయొక్క అత్యంత ప్రభావవంతమైన శక్తిని ఇనుమడింపజేయవలసినదిగా కోరుచున్నము.

పంచాంగకర్తలు



## ఉపయుక్త విషయములు

### నామనక్షత్ర సందేహ వివరణ

| నామ | నక్ష | పాద | నామ | నక్షత్ర | పాద |
|---|---|---|---|---|---|
| కృష్ణ | మృగ | 3 | క్షేముడు | పునర్వ | 1 |
| హృష్ణ | స్వాతి | 1 | ఫణి | ఉ.ఫ. | 3 |
| శ్రీధరు | చిత్త | 4 | ద్రోణ, ద్రౌపది | స్వాతి | 3 |
| క్షేత్రపా | హస్త | 2 | భీముడు | మూల | 4 |
| జ్ఞాను | ఆర్ద్ర | 3 | భైరవుడు | పూషా | 3 |

శ్లో॥ నరస్యద్వయనామాచ, ఆదినామక్ విసర్జయేత్।
అంత్య నామ గృహీత్వాచ, ఇత్యేత్ లగ్న కారణమ్

తా। విశేష నామములు గలవారు ఆదినామముల విసర్జింపవలయును. అనగా వీర వెంకట సత్య నారాయణ అనునామమునకు సత్యనారాయణ గ్రహించవలెను. అనగా వ్యవహారనామమును గ్రహించవలయును.

## జననవిషయమై దుష్టతిథి వారనక్షత్రములు

అశ్వ1 పాదం, మఘ 1 వ పాదం, రేవతి 4వ పాదం శిశు గండం; భరణి 3 వ పాదం, కృత్తిక 2 వపాదం, పుష్య 2, 3 వ పాదములు, మఘ 3 వ పాదం, (ఉత్తర1 పాదం అనికొందరు) ఉత్తరాషాఢ యందు 1 వ పాదం, హస్త 3 వ పాదం, చిత్ర 1-2 పాదములు, పూర్వాషాఢ 3 పాదం, ఇవి పురుషుడైన పిత్రు గండము, స్త్రీ అయినచో మాతృగండము ; రోహిణి 1-2 పాదములు తల్లికిని మేనమామకును, 3-4 పాదములు కేవలం మేనమామకును గండము. ఆశ్లేష2 వ పాదం ధనహాని, 3 వ పాదం తల్లికి గండం, 4 వ పాదం తండ్రికి గండము, 1 వ పాదము దోషముకాదు. మూల 1 వ పాదములో మొదటి సగము మిక్కిలిదోషమైనది. జ్యేష్ఠయొక్క నక్షత్రాద్యంతమును 11 చే భాగించి అందే భాగమైనదో ఆ భాగము యొక్క ఫలము తెలుసుకొనవలయును. 1 వ భాగం మాతామహిగండం, 2 వ భాగం మతామహ గండం, 3 వ భాగం మేన మామకు గండం, 4 వ భాగం తల్లికి గండం, 5 వ భాగం శిశు గండం,6 వ భాగం గోత్ర నాశనం,7 వ భాగం ఉభయ కుల నాశనం,8 వ భాగం సోదర గండం, 9 వ భాగం శ్వశుర గండం, 10 వ భాగం సర్వ నాశనం, 11 వ భాగం మిక్కిలి దుష్టము.; విశాఖ పురుషుడైన మేనమామకు గండం, స్త్రీ శిశువైన భర్తయొక్క సోదరునకు గండం, మీన మేషములకు కర్కాట సింహములకు వృశ్చిక ధనుస్సులకు సంధి అర ఘడియ ప్రబల శిశుగండం, పంచమీ షష్టికిని, దశమేకాదశులకును, పూర్ణిమా అమా ప్రతిపత్తులకు సంధి 2 ఘడియలు. వ్యతీపాత, వైధృతి, పరిఘ, వ్యప్ర, వైప్రలకును మహాపాతలు, సంధ్యాకాలము అమావాస్య, తల్లి, తండ్రి, సోదరుడు వీరి నక్షత్రములైనను, గ్రహణకాలమైనను గూడా శాంతి చేయవలెను. పైన చెప్పబడిన నక్షత్రములందు ఆయాపాదములందు జననమైనచో సంపూర్ణ మహాశాంతియు, ఇతర పాదములందైన సామాన్య శాంతియు చేసుకొనవలెను.

## గండ పురుష స్థితి

గండ పురుషుడు ఆషాఢ, భాద్రపద, ఆశ్వయుజ, మాఘమాసములందు స్వర్గలోకమునను, చైత్ర శ్రావణ కార్తీక పౌష మాసములందు భూలోకంబునను, వైశాఖ జ్యేష్ఠ మార్గశిర ఫాల్గుణ మాసములందు పాతాళంబునను నివసించును. గండపురుషుడు భూమియందు నివసించు కాలమున దుష్ట నక్షత్రం మొదలగు వాటియందు రజస్వల, జననమైనచో విశేష దోషం కలదు. ఇతర లోకములందు ఉన్నప్పుడు దుష్ట కాలమందు జననాదికమైన దోషం తగ్గును.

## నవగ్రహ శాంతి ( జన్మలేక నామ రాశి నుండి)

1. సూర్యుడు 1-2-4-5-7-12 స్థానములలో నున్నప్పుడు పరమ శివుని పూజించినను, సూర్యనమస్కారాలు చేసినను, ఎర్రనిపూవులచే అర్చనచేయించిన, ఎర్రబట్టలు ధరించినా, ఎర్రఆవు లేక గోధుమలు దానం చేసిన దోష నివృత్తి అగును.

2. చంద్రుడు 2-4-7-12 స్థానములలో నున్నప్పుడు అమ్మవారి పూజ చేసినను, శ్వేత పుష్పములచే పూజించినను, శ్వేతవస్త్రములు ముత్యములు ధరించినను, శంఖము లేక బియ్యము దానం చేసినను దోష నివృత్తి యగును.

3. కుజుడు 2-4-5-7-9-10-12 స్థానములలో నున్నప్పుడు సుబ్రహ్మణ్యుడు లేక కాళిని పూజించినను, రక్త వస్త్రం లేక పగడమును ధరించినను, పగడములేక ఎర్రనికందులు దానము చేసినను దోష నివృత్తి అగును.

4. బుధుడు 1-3-4-5-7-9-12 స్థానాలలో నున్నప్పుడు (విష్ణువు) రామాది విష్ణు అవతార మూర్తులను పూజించినను, పీతాంబర, మరకతం వీటిని ధరించినను, సువర్ణం లేక పెసలు దానం చేసినను దోష నివృత్తి యగును.

5. గురువు 1-3-4-6-8-10-12 స్థానాలలో నున్నప్పుడు దక్షిణామూర్తిని పూజించినను, పుష్యరాగం ధరించినను, పసుపు వస్త్రం లేక శనగలు దానం చేసినను దోషనివృత్తి యగును.

6. శుక్రుడు 9-3-8 స్థానాలలో నున్నప్పుడు పార్వతిని లేక లక్ష్మిని పూజించినను, శ్వేత వస్త్రం లేక వజ్రం ధరించినను, వెండి, తెల్లటి గుర్రం లేక బొబ్బర్లు దానము చేసిన దోష నివృత్తి యగును.

7. శని 1-2-4-5-8-7-9-10-12 స్థానములలో నున్నప్పుడు శాస్త్రా (అయ్యప్ప) పూజించినను, నల్ల వస్త్రము, ఇంద్ర నీలమును ధరించినను, నల్ల ఆవు లేక నువ్వులు దానము చేసినను దోషనివృత్తి యగును.

8. రాహువు 1-2-4-5-7-8-10-12 స్థానములలో నున్నప్పుడు దుర్గను పూజించిన, గోమేదికము ధరించిన, ఇనుము లేక మినుములు దానము చేసిన దోషనివృత్తి యగును.

9. కేతువు 1-2-4-5-7-9-10 స్థానములలో నున్నప్పుడు గణపతిని పూజించినను, వైఢూర్యమును ధరించినను లేదా దానిని దానము చేసినను దోష నివృత్తి అగును.

గమనిక:- దానముల విషయమున సద్బ్రాహ్మణుడు దొరకని పక్షమున ఆ ధాన్యమును ఆవుకు ఆహారము గానిచ్చుట, అగ్నిహోత్రునకు సమర్పించుట, ప్రవాహపు నీటి యందు వదులుట - క్రమంగా ఫలముల నొసగునని గురు వాక్యము.

## ఏకోదర సంస్కార నిర్ణయం

అన్నదమ్ములకు సమానమైన సంస్కారము ఏక ముహూర్తములో చేయరాదు. ఆరు మాసములు వ్యత్యాసముంచుట శ్రేష్టము. సంవత్సర నామం మారిన మధ్యమము. అయన ఋతు భేదములధమము. అన్నా చెల్లెళ్ళ కేక ముహూర్తమున సమాన స్థాయి సంస్కారం జరుపవచ్చును. తన కుమార్తెనిచ్చిన గృహమునుండి కన్యను తేరాదు. పెద్ద బిడ్డలకంటే పుత్రికా వివాహం గాని, పుత్రోపనయనం గాని చేయకూడదు. పుత్రికా వివాహానంతరం పుత్రోపనయనము సర్వస్య శుభకరము.

## వివాహ విషయం

శుభకార్యములన్నింటిలోను వివాహము చాల ముఖ్యమైనది. దంపతులు ఒకరి నొకరు చూచుకున్న వేళావిశేషములను బట్టి శుభాశుభ ఫలితములు జరుగు చుండును. వారిద్దరి జన్మలేక నామ నక్షత్రములను బట్టి జాతక కుండలులను బట్టియు మంచి చెడ్డలను తెలిసికొని వివాహం చేయుట శుభము. ముఖ్యముగా కుజదోషం చూడదగినది.

## వివాహమునకు శుక్రదోషం

శుక్రుడు జాతకమునకు కళత్ర కారకుడగును. స్త్రీ జాతకమునకు భర్త కారకుడగును. అందుచే 6-8-12 స్థానములందుండి పాపగ్రహ సంబంధము, దృష్టి గాని కలిగి పురుష జాతకమందున్నచో స్త్రీకిని, స్త్రీ జాతకమందున్నచో పురుషునకు దోషము కలుగును.



### జన్మతార, నామతార వివరణ

వరుని జన్మ నక్షత్రమునూ, కన్యా జన్మ నక్షత్రమునూ చూచుట శ్రేష్టము. కన్యకు జన్మనక్షత్రము లేనిచో, వరుని జన్మనక్షత్రము కన్య నామ నక్షత్రముతో చూడవచ్చును. వధూవరులకిద్దరకును జన్మ నక్షత్రములు లేనిచో నామ నక్షత్రములతోనే చూడవచ్చును. ఇదియును విరుద్ధమైనచో కన్యకు మరలనామకరణము చేయవలయునే గాని దానికి - భిన్నం కాకూడదు.

### జన్మరాశి, నామరాశి విషయం

దేశ, గ్రహ, గృహ, వ్యవహార, దాన మంత్ర, రాజసేవ, యుద్ధ, పునర్వివాహాద్యాదులందు అన్నింటికినీ నామ రాశియు - వివాహాది సమస్త శుభకార్యలన్నింటికినీ జన్మరాశియే శ్రేష్టమని చెప్పబడినవి.

### రాశి కూటములు చూచే విధము

స్త్రీ రాశికి పురుష రాశికి 2-12 మృత్యువు, 12-1 అయిష్టం, 3-11 సౌఖ్యం, 11-3 దుఃఖం, 4-10 విరోధము, 4-6 సౌభాగ్యం, 6-5 వైధవ్యము, 6-8 కలహము, 8-6 ప్రీతి, 7-7 శుభము ఈ రీతిగా చూడవలెను.

### యోని కూటమునందలి వైరవర్గ జంతువులు

కుక్క - లేడి, పాము - ముంగీస, సింహము - గజము, కోతి - మేక, గుర్రము - యెనుబోతు, గోవు - వ్యాఘ్రం, పిల్లి - ఎలుక ఇవి పరస్పర విరోధ జంతువులు.

## వివాహమునకుపయుక్తములగు రాశి కూటాదుల విషయాలు

రాశికూటాదులు స్త్రీ రాశి మొదలు కొని పురుషరాశి వరకు లెక్కించవలెను. పనికి వచ్చే మీన-మేష, వృష-మిథు, కన్యా-తుల, వృశ్చి-ధను, మక-కుంభ, వీటిలో 2-12 అయిన శుభము.

ఏకాదశ త్రికాలకు కర్కాట - వృష, మిథు-కన్య, సిం-వృశ్చి, తుల-మక, ధను-మీనం శుభాలు మిగిలినవి అశుభాలు.

నవపంచమములకుః - మిథు-కుంభ, మకర-కన్య, మీన - వృశ్చికలు శుభాలు మిగిలినవి అశుభాలు

షష్టాష్టకములకుః మేష-వృశ్చిక, కటక-ధను, సింహ-మీనం, కుంభం- కర్క, మక-మిథు, తుల-వృషభము ఇవి శుభములు. కన్య,-కుంభ, సింహ- మీనములు అశుభములు.

సమసప్తకములకుః సింహ కుంభ, మకర - కర్కాటకములు తప్ప మిగిలినవి శుభములు ఏక నక్షత్ర విషయములు; భర, మృగ, ఆశ్రే, హస్త, ఉ.షాఢ, శత, ఈ నక్షత్రములు దంపతులకు ఒకటైన పనికిరావు.

కృత్తి, రోహి, ఆర్ద్ర, మఖ, పుష్య, చిత్త, శ్రవ, ఉ.భా. రేవ ఇవి దంపతులకు ఏకమైన శుభం.

మిగిలినవి మధ్యమం దంపతులది ఒకే రాశి అయిన యెడల భిన్నపాదం భిన్న నక్షత్రం అయి న శుభం.

ఏక నాడి విషయం ; ఉత్తర, పూ.భా, పున, ఆర్ద్ర, మూల, అశ్విని ఈ నక్షత్రములందు ఏక (ది) నాడి దోషం లేదు.

మధ్యనాడి విషయం - పూ.షా, అనూ, ధని, పుష్య, చిత్ర, పూ.ఫ, మృగ ఇవి మధ్యనాడి ఐనను దోషం లేదు.

అంత్యనాడి విషయం - ఉ.భా, రేవ, రోహి, స్వాతి, విశా, ఆర్ద్ర ఈ నక్షత్రాలందు అంత్యనాడి దోషం లేదు.

పనికి వచ్చే రాక్షసగణ నక్షత్రములు - ఆశ్రే, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతభిషం, ఈ నక్షత్రములలో స్త్రీ రాక్షసగణమైనను దోషం లేదు. ఏకాధిపత్యం

అయినను, రాశి యోని, గ్రహ మైత్రి, నాడి ఇవి సహజంగా శుభంగా నున్నను స్త్రీలకు గల రాక్షసగణం దోషం లేదు. పరిహారం పనికివచ్చురాశి కుటాదులకు (16) గుణాలకన్న అధికంగా నున్న శుభం.

## బల్లిపడుట, తొండప్రాకుటవలన ఫలితములు

బ్రహ్మస్థానవమున రాజ్యం, లలాటవమున చెవుల యందు లాభం, నేత్రములయందు నాశికయందు శుభం, వామ దేహమున భీతి, భ్రూమధ్యమున కలహం, కంఠమున వ్యసనము, వెన్నెముక యందు మోసము, వీపు కుడి వైపున సుఖం, ఎడమవైపున రోగం, కుడిచేతి యొక్క భుజశిరస్సున శత్రు భయము, మిగిలిన చోట ధన నాశనము, హృదయము గౌరవం, దక్షిణ హస్తమున సౌభాగ్యము, వామ హస్తమున కీర్తి, కుడిప్రక్క సుఖము ఎడమ ప్రక్క పీడ, ఉదరమున ధాన్య లాభం, దీని కుడి ప్రక్క పుత్రలబ్ధి, ఎడమ ప్రక్క శిశు పీడ, నాభి యందిష్ట ప్రాప్తి, పొత్తి కడుపున వస్త్రలాభం, వామ కటి యందు దుఃఖం, కుడితొడ, కుడి మోకాలు కుడి పిక్కయందు దుఃఖము, కుడి పిరుదున ధన వృద్ధి, ఎడమ పిరుదున స్త్రీ వియోగము, కుడి చీలమండలయందు లాభము, ఎడమ చీలమండలయందు హాని, పాదములయందు ప్రయాణము కలుగును. పురుషులకు కుడి బాగములందలి ఫలము, స్త్రీలకు ఎడమ భాగము నందగును.

### సుశకునములు

శుభప్రదములు - ఇద్దరు బ్రాహ్మణులు, ఒక శూద్రుడు, ఉత్తమ విప్రుడు, క్షత్రియుడు, అశ్వము, గజము, గో వృషభములు, జలచరములు, వేశ్య, సువాసిని, స్త్రీ, దంపతులు, ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, పూవులు, పండ్లు, రత్నములు, భక్ష్యములు, చెరకు, మాంసము, ఛత్రము, చామరము, అద్దము, వీణ, మద్దెల, శంఖము, మంగళధ్వని, గోమయం, చిత్తడి మట్టి, శుభవాక్య శ్రవణం, పాలపిట్ట, బర్రె, కోడి, కాకి, నెమలి, భరద్వాజము, ముంగీస, మేక, ఇవి యెడమ ప్రక్కనుండి వెళ్ళుట మంచిది.

## సుస్వప్నములు

మేడ, పర్వతము, వృక్షములు, రథము, గుర్రము, ఏనుగు, చూచుట ఎక్కుట; ప్రభువు, బంగారం, ఎద్దు, ఆవు, అన్నము, గోక్షీరము, గోఘృతము, సత్ బ్రాహ్మణులు, కన్య, వేశ్య, నటుడు, రత్నములు, ముత్యములు, శంఖము, దేవతావిగ్రహములు, జలజంతువులు, కోడి, కొంగ, చందనం, అగ్ని, పూలచెట్లు, మామిడి, ఉసిరిక, మొదలగు ఫల వృక్షములు ; మారేడు, పుణ్య స్థలములు వీటిని చూచుట, పాలు, పెరుగు, తేనె, నేయి, భక్ష్యములు, మనుష్య మాంసము, పక్షిమాంసము భక్షించుట; పీతాంబరము, పీతమాల్యములు గల స్త్రీని కౌగిలించుకొనుట స్వప్నమైనచో ఆరోగ్యము ధనము, భూమి, సంతతి, స్త్రీ లాభము మొదలగు శుభములు కలుగును. తెలుపు, పచ్చని వస్తువులు చూచుట మంచిది.

## శుభ ముహూర్త విషయములు

**ఉయ్యాలలో వేయుటకు** :- 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్ర వారములు,; అశ్విని, రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, అనూ, ఉ.షాఢ, ఉ.భా, రేవతి నక్షత్రములు.; వృషభ, మిథు, కర్కాటక, కన్య, తుల, ధను, మీన లగ్నములు అష్టమశుద్ధి చూడవలెను.

**నామకరణము** :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు ; అశ్విని, రోహి, పున, పుష్య, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, నక్షత్రములు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు,; వృషభ, మిథు, కర్కా, కన్య, తులా, ధను, మీన లగ్నములు, పక్ష ఛిద్రము గాని దినములు, అష్టమ శుద్ధి చూడవలెను.

**అన్నప్రాశనం** :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, రోహి, మృగ, పున; పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు ; వృషభ, మిథున,



కన్యా, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి, దశమ శుద్ధి కావలెను. పురుషులకు సరిమాసం, స్త్రీలకు బేసి మాసం చూడవలెను.

**చెవులు కుట్టుటకు** :- 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్ర, వారములు ; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు ; వృష, మిథున, కర్కాట, కన్య, తుల, ధను, మీన లగ్నములు, అష్టమ శుద్ధి, జన్మాది 6, 7, 8 మాసములందు జరిపించవలెను.

**కేశ ఖండనము**:- 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్ర, వారములు ; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు ; వృష, మిథు, కర్కా, కన్య, తుల, ధను, మీన లగ్నములు, ఉత్తరాయణము నందు పూర్వార్ధమున చేయాలి. అష్టమ శుద్ధి, మధ్యాహ్నంలోపుగానే చేయాలి.

**ముక్కుకుట్టుటకు** :- అశ్విని, మృగ, పున, పుష్య, ఉత్త, చిత్త, స్వాతి, ధని, శ్రవ, ఉ.భా, రేవతి నక్షత్రములందును, శుక్లపక్షమునందును, ఉదయకాలమున మంచిది.

**అక్షరాభ్యాసం**:- 2, 3, 5, 7, 10, 13 తిథులు ;సోమ, బుధ, గురు, శుక్ర, వారములు; అశ్విని, మృగ, పున, పుష్య, ఆర్ద్ర, స్వాతి, అనూ, శ్రవ, రేవతి నక్షత్రములు, మేష, కర్క, తుల, మకరలగ్నములు, అష్టమ శుద్ధి, ఉత్తరాయణంలోను, 5 సంవత్సరాలలోపు చేయాలి. గురు శుక్ర మూఢమిలందు చేయరాదు.

**విద్యాభ్యాసం**:- 2, 3, 5, 7, 10 తిథులును ; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, మృగ, పున, పుష్య, ఆర్ద్ర, హస్త, చిత్త, స్వాతి, మూల, శ్రవ, రేవతి నక్షత్రములు; మేష, కర్క, తుల, మకర, మీన లగ్నములు, అష్టమ శుద్ధి, అనధ్యాయ రహితము, పగటి భాగమునందు చేయాలి.

**ఉపనయనము**:- శుక్లపక్షమున 2, 3, 5, 7, 10, బహుళమున 2, 3, 5 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్విని, రోహి, మృగ, పున, పుష్య, ఉ.ష, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు ; వృష, మిథు, కర్క, కన్య, ధను, మీనలగ్నములు, అష్టమ శుద్ధి చూడాలి. అనధ్యయనం కూడదు. మీన చైత్రం మంచిది. గ్రహబలం ముఖ్యం. తల్లిదండ్రులకు తారాబలం చూడాలి. కేంద్రములందు పాప గ్రహములు ఉండరాదు.

**యజ్ఞోప వీత ధారణకు** :- (జంధ్యము వేసుకొనుట) శ్రావణ పౌర్ణమికి, గ్రహణం విడిచిన తరువాత, పురిటిమైల శుద్ధి అయిన తరువాత, అశౌచముల తరువాత, క్రొత్త జంధ్యం ధరించాలి.

**వివాహ నిశ్చయతాంబూలములకు** :- 2, 3, 5, 7, 10, 13 పూర్ణిమ ఉభయ పక్షముల తిథులు ; ఆది, బుధ, గురు, శుక్ర శని వారములు ; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధనిష్ట, శతభి, రేవతినక్షత్రములందునూ, లగ్నమునకు 5, 9 స్థానములందు పాప గ్రహములు లేకుండా చూసుకొనవలెను.

**పెండ్లి కుమారుని, పెండ్లికుమార్తెను చేయుటకు** :- 2, 3, 5, 7, 10, 13 తిథులు, సోమ, బుధ, గురు, శుక్ర, శనివారములు ; అశ్విని, పున, పుష్య, చిత్త, స్వాతి, శ్రవ, ధనిష్ట నక్షత్రములు, 5, 9 స్థానాలందు పాపగ్రహములు లేకుండా చూసుకొనవలెను.

**వివాహము**:- మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ, మార్గశిర, కార్తిక మాసములు మంచివి. సూర్యుడు చైత్ర మాసమున మేష రాశియందుండగా చేయవచ్చును. 2, 3, 5, 7, 10, 13 తిథులు, బుధ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, ఉత్త, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, ఉ.భా, రేవతి నక్షత్రములు ; వృష, మిథు, కర్కాట, తుల, కన్య, ధను, మీన లగ్నములు, సప్తమ స్థానమునందు ఏ గ్రహము ఉండరాదు. అష్టమ శుద్ధిని కూడా చూడాలి. పెండ్లిపీట అయిదంగుళాల వెడల్పు, 6 అంగుళాల ఎత్తు, 37 అంగుళాలు పొడవు ఉండవలెను.

**గర్భాదానం** :- 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పున, పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, నక్షత్రములు; వృష, కర్కా, తుల, కన్య, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి, అష్టమ శుద్ధి చూడాలి. పంచ పర్వముల, ప్రతిదిన సంధ్యా సమయము, శ్రాద్ధదినములు అశుభము. వివాహం అయిన 16 రోజులలోపున చేసిన యెడల ముహూర్తంతో పనిలేదు.

**నిషేకము:-** (వర్తమాన పరిస్థితులలో అవసరంలేదు) 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, రోహి, ఉత్త, హస్త, అనూ, ఉ.షా. శ్రవ, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు ; వృషభ, మిథున, కర్కాట, తుల, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి ఉండాలి. పంచపర్వ, వ్రత దినములు, సంధ్యాసమయంకూడదు. నిషేకము అనగా వయస్సు కలిగి రజస్వలకాని స్త్రీ భర్తతోకలియుట నిషేకం అందురు.

**పుంసవన సీమంతము :-** 2, 3, 5, 7,10, 13, 15, తిథులు; బుధ, గురు, శుక్రవారములు ; రోహి, హస్త, చిత్త,స్వాతి,పుష్య,ఉత్తరాత్రయం, పున, అనూ, శ్రవ,ధని,శత,రేవతినక్షత్రములు;మేష,మిథు,ధను,కుంభ, తులా లగ్నములు, పుంసవనమునకు 3వ నెల, సీమంతమునకు 4, 6, 8 నెలలు మంచివి.

**గృహారంభము:-** (శంకుస్థాపన) 3, 5, 7, 11, 15 తిథులు; బుధ, గురు, శుక్ర వారములందునూ, రోహి,మృగ,పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములందునూ ; వృష, సింహ, వృశ్చిక, కుంభలగ్నములు మంచివి. మేష, కర్కా,తుల, మకరములు మధ్యమము, మిథు, కన్య, ధను, మీన రాశులు లగ్నమునకు చతుర్ధ, అష్టమరాశులుగా ఉండాలి. చతుర్థ అష్టమములందు పాప గ్రహములుండరాదు. ఉదయము 12.00 లోపునే శంకుస్థాపనకు మంచిది. వృషభ, కలశచక్ర శుద్ధులు కూడచూడవలెను.

**గృహ ప్రవేశము:-** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ, బుధ, గురు, శుక్ర వారములందునూ; రోహి ,మృగ,ఉత్త, చిత్త, అనూ,ఉ.షా, ధని, శత, ఉ.భా. రేవతి నక్షత్రములందునూ ; వృష, మిథు, కన్య, ధను, మీనలగ్నములు మరియు స్థిర లగ్నములయినచో అత్యంత బలీయము. చతుర్థ అష్టమ శుద్ధులు, వృషభ - కలశ శుద్ధి ఉండాలి.

**యాత్రలు చేయుటకు :-** 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు; మేష, వృషభ,కర్కా,కన్య, తుల;ధను, మకర లగ్నములు మంచివి. మరియు ప్రయాణమునకు మంచి శకున బలము, తారాబలము, పంచమ శుద్ధి, వార శూల,పంచక రహిత,గౌరిపంచాంగం,ఆనందాది యోగములు చూడాలి.

**ఉద్యోగములో చేరుటకు :-** 2, 3, 5, 7, 13 తిథులు, అశ్వి, పున, పుష్య, హస్త, చిత్త, అనూ,రేవనక్షత్రములు ; బుధ, గురు, శుక్రవారములు ; శుభలగ్నములందునూ, రవి, కుజులు, 10, 11 లలో ఉండిన చాలా మంచిది. ఉద్యోగాదులందు స్థిరత్వము పొందును.

## స్త్రీలకు సంబంధించిన శుభ ముహూర్త విషయములు

**అత్తవారింటికి వెళ్ళుటకు :-** 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్వి,రోహి,మృగ, పుష్య, ఉత్తరాత్రయం, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ధని, రేవనక్షత్రములు ; వృష, మిథు, కర్కా, సింహ, వృశ్చిక, ధను, కుంభ, మీనలగ్నములు, ద్వాదశ శుద్ధి, బేసి మాసములు వివాహం జరిగిన16 రోజులలో తిథి వార నక్షత్రములు పాటించక అత్తవారింటికి గృహప్రవేశము చేయవచ్చును. (ఆది,శుక్ర వారం అత్తవారింటికి వెళ్ళకూడదు)

**గాజులు ధరించుటకు:-** గర్భవతి అయిన స్త్రీకి (3,5,7) బేసి మాసము లందునూ,2,3,5,7,11తిథులందు,బుధ,గురువారములందు, మంచి నక్షత్రములలో,వర్జ్య దుర్ముహూర్తములు లేకుండ గాజులు వేయించుట మంచిది.

**గర్భవతి అయిన స్త్రీని పురిటికి తీసుకొని వచ్చుటకు:-** తిథి, వార, నక్షత్రములు మంచివి చూసి వర్జ్య దుర్ముహూర్తములు లేకుండా 7 వ మాసము, లేదా 9 వ మాసము రాగానే పురిటికి పుట్టింటికి తీసుకురావలెను. మొదటి పురుడు, రెండవ పురుడు పుట్టింట్లో పోయాలి. మూడో పురుడు పుట్టింట్లో పోయరాదు. శిశు వస్త్రం అత్తవారింట్లో పోయాలి.

**బాలింతరాలికి పథ్యము:-** బుధ, గురు, శుక్రవారములు, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉత్త, ఉ.షాఢ, ధనిష్ఠ, శత, ఉ.భా,



రేవనక్షత్రములు, 2, 3, 5, 7, 9, 10,11,13,15 తిథులందునూ దశమమందు పాప గ్రహము లేకుండా చూడాలి.

**బాలింత రాలికి స్నానమునకు :-** అశ్వ, రోహి, మృగ, ఉత్త, స్వాతి, అనూ, ఉ.షా, ఉ.భా, రేవనక్షత్రములందునూ, ఆది, మంగళ, బుధ, గురువారములుమంచివి. 7 గాని 11వ రోజునగాని చేయించవలెను.

**బాలింతరాలికి నీళ్ళు తోడుటకు :-** 2, 5, 7, 9, 10, 11,13 తిథులు; మృగ, పున, పుష్య, హస్త,అనూ,మూల,శ్రవ నక్షత్రములు ; సోమ, బుధ,గురువారములు; 21, 23, 25, 27, 29 రోజులలో బాలింతరాలుచే జలపూజ చేయించి నూతిలో నీళ్ళు తోడించవలెను.

**శిశువునకు మొలత్రాడు కట్టుటకు :-** పురుటి శుద్ధి రోజున మంచిది. అశ్వ, రోహి, మృగ, పుష్య,ఉత్త, హస్త,అనూ, ఉ.షా,ఉ.భా,రేవతీ నక్షత్రములు; మంగళవారము మంచిది కాదు. వెండి లేదా బంగారపు మొలత్రాడు 5 వ నెలలో కట్టాలి. మొలత్రాడునకు రాగి, లేదా నల్లపూసలు, శిశువు పురిటి సమయమునందు తీసిన బొడ్డుగాని కట్టిన దృష్టి దోషాలు తొలగిపోవును.

**శిశువునకు సూర్య చంద్రుల దర్శనం:-** శిశువు జన్మించిన మాసంలో మంచితిథి, వార, నక్షత్రములు చూసి సూర్య, చంద్రులను చూపించాలి.

**బిడ్డను ఇల్లు కదుపుటకు :-** 2, 3, 5, 10, 11, 13 తిథులు ; అశ్వ, రోహి, పున, పుష్య, మృగ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధని, శత, రేవనక్షత్రములు ; మేష, వృష, కర్కా, తుల, ధను, మీన లగ్నములు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు శుభం ; శిశువుపుట్టిన 3 వ నెలలో ఇంటి నుండి వెళ్ళి ఒక రాత్రి అయిన బయట నిద్దుర చేయాలి.

**పురుడు తరువాత శిశువుతో అత్తవారింటికి వెళ్ళుటకు :-** శిశువుకు 3 వ నెల గాని,5 వనెలగాని ఆపై 7,9,11 నెలల్లోఅత్తవారింటికి వెళ్ళవచ్చును. వర్తమానంలో కొంతమంది 1 వ నెలలోనే పంపించుచున్నారు.అందు వలన స్త్రీ ఆరోగ్యం క్షీణించును. 2, 3, 4, 7,10,11,13 తిథులు ; సోమ, బుధ,గురు, శనివారములు అశ్వ,రోహి,మృగ,పున,పుష్య,మఖ,ఉత్త, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, శ్రవ, శత, ఉ.భా, రేవ నక్షత్రములలో తారాబలం, వారశూల, ఆనందాది యోగములు చూడాలి. తారాబలము మాత్రం తల్లికి, శిశువుకు సరిపోవాలి. శూన్య మాసములు, గురు, శుక్ర మౌఢ్యమి పనికిరావు.

**స్త్రీలు ఆభరణములు, నూతన వస్త్రములు ధరించుటకు :-** అశ్వ, హస్త, చిత్త, విశా,స్వాతి, అనూ, ధనిష్ఠ, రేవనక్షత్రములందు ; బుధ, గురు, శుక్రవారములందు వెండి,బంగారు ఆభరణములు,వస్త్రములు ధరించుటమంచిది. సోమ,మంగళ వారములందు సౌభాగ్య స్త్రీలు నూతన వస్త్ర ఆభరణములు ధరించరాదు.

**గర్భిణీ స్త్రీ ధర్మములు :-** గర్భిణి ఈ నియమములు తప్పనిసరిగా పాటించవలెను. ఏనుగు, గుఱ్ఱపుబండి, పర్వతం, మేడలు ఎక్కరాదు. చెఱువుల వద్ద, వట వృక్షములక్రింద కూర్చునరాదు. సంధ్యలందు భుజింపరాదు. దిగంబరులై స్నానము చేయతగదు. సంభోగ సుఖము కూడదు. గోళ్ళు గిల్లు కొనుట, కొరుకుట, ఆకులు తుంచుట చేయరాదు. మాంసభక్షణ చేయరాదు. ముత్తైదువుల, బ్రాహ్మణులను పూజించాలి. భగవన్నామము జపించాలి. శుభప్రదమైన ఆభరణములు ధరించాలి. 4, 6,8 మాసములలో సముద్ర స్నానం, చెట్లు నరుకుట, వివాహాదిశుభ కార్యములు, ప్రయాణము చేయరాదు. నిత్యము ఉప్పు, నూనె , బెల్లము, ఫలము దానము చేయవలెను. గర్భిణీ స్త్రీ ఏ వస్తువును కోరునో ఆ వస్తువును వెంటనే తెచ్చి ఇవ్వవలెను. అశౌచ వ్యక్తులను తాకరాదు. శోకించరాదు. సూర్య చంద్ర గ్రహణములందు జాగ్రత్తగా పరుండవలెను.

## విద్యాముహూర్త విషయములు

**నాట్యం నేర్చుకొనుటకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములు; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ ; ఆరు, పుష్య, ఉత్త, అనూ, ఉ.షా, ధని, శత, ఉ.భానక్షత్రముల మంచిది.

**వాయిద్యములు నేర్చుకొనుటకు :-** బుధ, గురు, శుక్రవారములు ; 5, 7, 10, 11 తిథులందునూ ; రోహి, మృగ, స్వాతి, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రములందు; వృషభ, తులాలగ్నములు చాలా మంచివి. చతుర్థ శుద్ధి కావాలి.

**సంగీత శిక్షణకు :-** సోమ, గురు; శుక్రవారములు ; 3, 5, 7, 10, 11, 13, తిథులందునూ ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్త, హస్త, స్వాతి, అనూ, శత, ఉ.భా. రేవతి నక్షత్రములందును ; వృష, మిథు, కర్కా, తుల, ధను, మీన లగ్నములు, ద్వితీయ చతుర్థ శుద్ధులు. లగ్నమునకు గురు, శుక్రుల దృష్టి కలిగి యుండుట మంచిది.

**వ్యాకరణ విద్య:-** సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూరాన క్షత్రములందునూ వ్యాకరణమునేర్చుకొనుట ప్రారంభించుటకు శుభము.

**గణిత విద్యారంభమునకు :-** బుధ, గురువారములందునూ ; రోహి, ఆరు, పుష్య, అనూ, శత, రేవతి నక్షత్రములందు నేర్చుకొనుట మంచిది.

**వైద్య విద్యారంభమునకు :-** ఆది, సోమ, మంగళవారములు ; అశ్వ, మృగ, ఆరు, పున, పుష్య, ఆశ్రే, హస్త, చిత్త, స్వాతి, అనూ, జ్యేష్ఠ, మూల, శ్రవ, ధని, శత, రేవతినక్షత్రములు వైద్యవిద్యకు చాలమంచిది.

**జ్యోతిశ్శాస్త్రము నేర్చుకొనుటకు :-** బుధ, గురు, శుక్రవారములు; 2, 3, 5, 7, 10, 11 తిథులు ; రోహి, మృగ, పుష్య, ఉత్త, స్వాతి, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రములు : వృషభ, సింహ, తులా, వృశ్చిక, ధను, కుంభ, మీన లగ్నములలో; ద్వితీయము గాని కేంద్రకోణములందుగాని రవి బుధులుండి లగ్నమునందు గురు శుక్రులుండగా ప్రారంభించిన యెడల మంచి వాక్శుద్ధి కలిగిన జ్యోతిష విద్యావేత్త, విశారదుడు అగుననుటలో సందేహము లేదు.

**శస్త్ర చికిత్సకు :-** 4, 9, 14 తిథులందును, శుక్లపక్ష తిథులందునూ ; మంగళవారము, జ్యేష్ఠ, ఆరుద్ర, ఆశ్రే, మూల, నక్షత్రములు, అష్టమ శుద్ధి గల లగ్నమునందును కుజుడు బలవంతుడై యుండగా ఆపరేషన్ చేయించుకొనుటకు మంచిది. చంద్రుడు జన్మరాశి యందు ఉండగా, పాప నక్షత్రములందుండగానూ, చంద్ర స్థిర నక్షత్రములకు పాపగ్రహ క్రాంత ఉండగా ఆపరేషన్ చేయరాదు. తిరిగి అనారోగ్యం కలుగును.

## వ్యాపార సంబంధ ముహూర్త విషయములు

**బట్టల దుకాణము ప్రారంభించుటకు :-** అశ్వ, రోహి, పున, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, రేవతినక్షత్రములు ; 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**బంగారు, వెండి, నగల వ్యాపారములనకు :-** 2, 3, 5, 7, 10, 11తిథులందు ; అశ్వ, రోహి, పున, పుష్య, ఉత్తర, హస్త, స్వాతి, చిత్త, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా. రేవతి నక్షత్రములందు, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకముగా నుండును.

**కిరాణా దుకాణం :-** 2, 3, 5, 7, 10 తిథులందునూ, అశ్వ, రోహి, మృగ, పుష్య, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రములందును ; ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకము.

**ఇనుము స్టీలు :-** 2, 3, 5, 7, 10, 11, 13, శుక్లపక్షమున14వ తిథి మంచిది. శని, సోమ, బుధవారములు ; అశ్వ, రోహి, మృగ, పుష్య, హస్త, అనూ, ఉ.భా. నక్షత్రములు మంచివి.



**ఎలక్ట్రికల్ షాపులు :-** 2, 3, 5, 7, పూర్ణిమ తిథులందునూ, మంగళ, బుధ, శుక్రవారములందును ; రోహి, మృగ, పుష్య, హస్త, అనూ, ఉ.భా నక్షత్రములు మంచివి.

**ఫ్యాన్సీ షాపులు :-** 2, 3, 5, 7, 11 తిథులు ; ఆది, మంగళ, బుధవారాలు; రోహి, మృగ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, ధనిష్టలు మంచివి.

**పండ్ల దుకాణాలు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు ; సోమ, బుధ, గురు, శుక్ర వారాలు ; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, పూ.భా, ఉ.భా, రేవతి నక్షత్రాదులందు లాభాదాయకం.

**స్టేషనరీ దుకాణాలు :-** 2, 3, 5, 7,10 తిథులందునూ ; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, హస్త, స్వాతి, అనూ, ఉ.షా. శ్రవ, ఉ.భాద్ర, నక్షత్రములందును ప్రారంభించిన ధన లాభం కలుగును.

**రేడియో, టీవి, వాచ్ దుకాణములు :-** 5, 7, 10 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ఉ.భా, రేవతులు, లగ్న బలం కూడవుంటే లాభాదాయకము.

**రైసు మిల్లు ప్రారంభించుటకు :-** 2, 3, 5, 7, 10, 11, తిథులందు ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా. శ్రవ, ఉ.భా. రేవతి నక్షత్రములందునూ స్థిర లగ్నములందును, చతుర్థ అష్టమ శుద్ధులు కావలెను.

**సినిమా వ్యాపారములు :-** ఫిలిం డిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు – సోమ, బుధ, గురు, శుక్రవారములు ; 2, 3, 5, 7, 10, 11, 13, 15, తిథులందునూ; అశ్వ రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, స్వాతి, అనూ, ఉ.భా, రేవ నక్షత్రములందునూ ; సప్తమశుద్ధి, శుక్రుడు బలీయముగా నున్న ఈ వ్యాపారమునందు అధిక లాభములు కలుగును.

**సైకిలు, మోటారు సైకిళ్ళ వ్యాపారమునకు :-** 2, 5, 7, 10 తిథులందు ; మంగళ, బుధ, గురు, శుక్రవారములందునూ ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, స్వాతి, అనూ, మూల, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములందు ; స్థిర శుభ లగ్నములందు చేసిన శుభము. తృతీయ శుద్ధి మంచిది.

**హోటల్ వ్యాపారమునకు :-** 2, 3, 5, 7, 10 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్రవారములందు ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా , రేవతి నక్షత్రములందు చేసిన లాభదాయకము. తృతీయ శుద్ధి మంచిది.

**చిట్‌ఫండ్ వ్యాపారమునకు :-** 3, 5, 7, 10, 11 తిథులు ; సోమ, బుధ, గురు, వారములందు ; అశ్వ, రోహి, మృగ, ఉత్త, స్వాతి, అనూ, ఉ.షా, ఉ.భా, రేవతి నక్షత్రములందునూ ; వృష, మిథు, కర్క, తులా, ధను, మీనలగ్నములు, సప్తమమందు బలీయమైన శుభగ్రహం ఉండుట చాలమంచిది.

**పుష్పముల దుకాణము :-** సోమ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, స్మాతి, ఉ.షా, శ్రవ, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు చాలమంచివి.

**అప్పు ఇచ్చుటకు పుచ్చుకొనుటకు :-** అష్టమ శుద్ధితో కూడిన లగ్నమందునూ, స్వాతి, పున, పుష్య, ధని, శ్రవ, శత నక్షత్రములందునూ ; చర లగ్నమందునూ, 5, 9 స్థానములందు శుభులుండగా అప్పులు ఇచ్చుటకు మంచిది. మంగళవారం, సంక్రమణదినమందు, హస్తతో కూడిన ఆది వారము అప్పు తీసుకోకూడదు.

**లిక్కర్లు - మత్తు పానీయములు, వ్యాపారమునకు :-** మేష, వృషభ, కర్క, తుల, ధను, మకర, కుంభ, మీన లగ్నములందునూ, మంగళ, శని, ఆదివారములందునూ ; భరణి ఆర్ద్ర, ఆశ్రేష, మఖ, పుబ్బ, జ్యేష్ఠ, మూల, పూ.షా, ఉ.భాద్ర, నక్షత్రములందు మంచిది.



## వ్యావసాయక విషయాలు

**క్రొత్త భూమిలో సాగు చేయుటకు :-** 2,3,5,7,10,11,13,15 తిథులందునూ; మంగళ, బుధ, శుక్ర వారములందునూ; అశ్వ, రోహి, మృగ, మఖ, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, ధని, ఉ.భా, రేవతి నక్షత్రములందు భూమిలో సాగు చేయుటకు మంచిది.

**ఏరువాక దుక్కి దున్నుటకు :-** ఆది, మంగళ, గురువారములు ; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, విశా, అనూ, మూల, పూ.షా, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవనక్షత్రములందునూ ; వృష, మిథు, కన్య, మీన లగ్నములందునూ, దుక్కిదున్నుట ప్రారంభించుటకు మంచిది. మేష లగ్నమున పశు నష్టము. కర్కాటకమున అధిక వర్షము వలన పంటనాశనము, సింహమునందు విషజంతుభయం, తులయందు ప్రాణభయం, మకరమునందు పంట నాశనము, కుంభమునందు దొంగల భయము కలుగును.

**విత్తనములు చల్లుటకు :-** 2,3,5,7,10,11,13 తిథులందు; అశ్వ, రోహి, పుష్య, మృగ, ఉత్త, చిత్ర, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవ నక్షత్రములందు విత్తనాలు చల్లిన బాగుగా మొలకెత్తును. ఏ రంగుగల విత్తనములు ఆ రంగు గ్రహ వారాదులందు చల్లిన బాగుగా పంట పండును. ఉదా:- తెల్ల విత్తనాలు సోమవారం చల్లవలెను.

**పొలి పెట్టుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందునూ; ఆది, గురు, శుక్ర వారములందునూ ; అశ్వ, రోహి, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ఉ.షాఢ, ఉ.భా. రేవనక్షత్రములందు మంచిది.

**వరి ఆకు ఊడ్చుటకు :-** 4, 5, 7, 9,10,11 తిథులందునూ ; సోమ, బుధ, గురు, శుక్ర వారములందునూ; అశ్వ; రోహి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉ.భా. రేవతి నక్షత్రములందు మంచిది.

**పంట కుప్పనూర్చుటకు, వేయుటకు :-** 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ; బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, రోహి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉ.భా. రేవతినక్షత్రములందు కుప్పనూర్చిన వేసిన చాల మంచిది.

**ధాన్యం పొలం నుండి తెచ్చుటకు :-** యజమాని తారాబలం, చంద్ర బలం, చూసుకొని వర్జ్య, దుర్ముహూర్తాలు లేకుండా, శుభగ్రహ హోరలలో ఇంటికి కొత్త ధాన్యము తెచ్చుకొనవలెను.

**ధాన్యం దంచుటకు :-** మఖ, పుబ్బ, అనూ, జ్యేష్ఠ, మూల, రేవతి నక్షత్రములతో కూడిన సింహ లగ్నమునందు చాలా మంచిది ధాన్యం పాడవదు.

**క్రొత్త ధాన్యమును భుజించుటకు :-** అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవనక్షత్రములందు; గురు, శని, వారములందునూ ; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ; మేష, వృశ్చిక, మీన లగ్నములందునూ మంచిది. అష్టమ చంద్రుడు కూడదు.

**పొగాకు నారు వేయుటకు :-** ఆది, మంగళ, గురు, శుక్రవారములందునూ; మృగ, పున, జ్యేష్ఠ, అశ్వ, మృగ, పుష్య, మఖ, అనూ, ఉత్తర, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములందు వేసిన మంచి ఫలితములు ఇచ్చును.

**అరటి తోట వేయుటకు :-** ఆది, మంగళ, గురు, శుక్ర వారములందునూ ; మృగ, పున, జ్యేష్ఠ, అశ్వ, మృగ, పుష్య, మఖ, అనూ, ఉత్తర, ఉ.భాద్ర, రేవనక్షత్రములందు వేసిన మంచి ఫలితమును యిచ్చును.

**నర్సరీ వేయుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందు ; బుధ, గురు, శుక్రవారములు ; అశ్వ, రోహి, మృగ, పుష్య, హస్త, స్వాతి, శ్రవ, రేవ నక్షత్రములందును; మిథు , కన్య, ధను, మీన లగ్నములందును వేసిన మంచిది.

**కంది, సెనగ, పెసర, మినుము, గోధుమ, విత్తనముల వేయుటకు :-** 2, 3,5,7,10,11,13 తిథులు ; బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పున, ఉత్త, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములు; వృషభ, కర్క, సింహ, తుల, వృశ్చి, ధను, కుంభ లగ్నములు లాభాదాయకము.



**ఖర్జూర, పోక, కొబ్బరి తోటలు వేయుటకు :-** బుధ, గురు, శుక్రవారములందునూ ; శుభ తిథులందునూ ; అశ్విని, మృగ, పుష్య, హస్త, అనూ, మూల నక్షత్రములందునూ మొక్కలు వేసినచో లాభం కలుగును.

**పిడకలు గూడు కట్టుటకు :-** 2, 3. 5, 7, 10, 11,13 తిథులందునూ ; బుధ, గురు, శుక్రవారాలందునూ ; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్ర, స్వాతి, అనూ, శ్రవ, రేవ నక్షత్రాదులందునూ ; వృష, మిథు, సింహ, కన్య, వృశ్చి, ధను, కుంభలగ్నాలు మంచివి. లగ్నానికి శుభగ్రహ దృష్టి యుండాలి.

**పొలము కాపలా కాయుట ప్రారంభించుటకు :-** బుధ, గురు, శుక్ర వారములందు ; అశ్విని, కృత్తిక, చిత్త, మూల, ధనిష్ట, నక్షత్రములందు మంచివి.

## పశు సంబంధ ముహూర్తాలు

**పశు శాల వేయుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందునూ; అశ్విని, మృగ, పుష్య, హస్త, మూల, పూ.భాద్ర నక్షత్రములందునూ పశువులశాల వేయుటకు మంచిది. పుష్యమి గురువారం కలిసిన రోజున వృషభ నవాంశ యందు పశువులు దొడ్డి వేసిన మృత చోర భయములు కలుగక క్షేమంగా యుండును.

**పొలము కాపలా కాయుట ప్రారంభించుటకు :-** బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, కృత్తిక, చిత్త, మూల, ధనిననక్షత్రము లందు మంచివి.

**పశువులకు బంధం వేయుటకు :-** అశ్విని, మృగ, పుష్యమి, పుబ్బ, మూల, రేవతి నక్షత్రములందు ఆది, గురు, శుక్ర వారములందునూ మంచిది.

**పశువులను క్రొత్తగా తెచ్చుటకు –** ఆది, మంగళ, శని వారములు; భరణి, కృత్తిక, ఆరుద్ర, అనూ, మఖ, మృగ, పున, స్వాతి, చిత్ర, మూల నక్షత్రములు శుభము.

**క్రొత్తగా పశువులను కాడి పూన్చుటకు :-** ఆది గురు వారములు; అశ్వ, భర, రోహి, పున, హస్త, విశాఖ, జ్యేష్ఠ, శత, రేవతి నక్షత్రములందు మంచిది.

**పశువులను కొనుటకు :-** బుధ, గురు, శుక్రవారములందును ; అశ్వ, భర, రోహి, పున, హస్త, విశాఖ, జ్యేష్ఠ, శత, రేవతి, నక్షత్రములందు మంచిది.

**పశువులను అమ్ముటకు :-** సోమ, బుధ, గురువారములు ; అశ్విని, మృగ, ఆశ్రే, మఖ, హస్త, విశా, జ్యేష్ఠ, పూ.షాఢ, ధని, పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి.

**పశువులను పశువుల శాలలో కట్టుటకు :-** అశ్వని, మృగ, పుష్య, హస్త, మూల, పూర్వాభాద్ర నక్షత్రములందు క్రొత్తగా పశువులను కట్టిన పశువృద్ధి కలుగును.

**దూడలను దుక్కికి మప్పుటకు :-** 2, 3, 5, 7, 11, 13 తిథులందునూ; ఆది, సోమ, గురు, శుక్రవారములందునూ; అశ్వని, రోహిణి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్త, హస్త, స్వాతి, విశాఖ, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములందు మంచిది.

**పోతులను పూన్చుటకు :-** 4, 8, 9, 14 , 30 తిథులందు; ఆదివారము లందునూ; భరణి, రోహి, చిత్త, ఉత్తర, ఉ.షాఢ, శ్రవణ, ఉ.భాద్ర, నక్షత్రములందునూ పూన్చుటకు మరియు దుక్కి కట్టుటకు, కాడి పూయుటకు శుభము.

## జల సంబంధ ముహూర్త విషయాలు

**గాలము ముహూర్తము :-** 1, 2, 3, 5, 7,10,11,13,15 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందును; రోహి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, పూ.షాఢ, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, పూ.భాద్ర, ఉ.భాద్ర రేవతి నక్షత్రములందు ; వృషభ, మిథున, కర్కాటక, తుల, మకరం, కుంభ, మీన లగ్నములందు మంచిది.

**వల ముడుచుటకు :-** సోమ, బుధ, గురు, శుక్రవారములందు ; రోహిణి, పుష్యమి, ఆర్ద్ర, ఉత్తర, ఉ.షాఢ, శ్రవణ, ధనిష్ఠ, శత, ఉ.భాద్ర నక్షత్రములు మంచివి.

**వలసిటిలో తడుపుటకు :–** 1,5,10,11,15 తిథులందునూ; బుధ, గురు, శుక్రవారములందునూ ; అశ్వని, రోహిణీ, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, ఉత్తర, ఉ.షాఢ, ఉ.భాద్ర, అనూ, శ్రవణం, రేవతి నక్షత్రములందునూ మంచిది.

**పడవలు తయారు చేయుటకు :–** 2,3,5,7,10,13 తిథులందునూ; బుధ, గురు, శుక్ర వారములందునూ; అశ్వని, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, ఉత్త, ఉ.షాఢ, ఉ.భాద్ర, అనూ, శ్రవణ, రేవతి నక్షత్రములందునూ, వృషభ, మిథున, కర్కాటక, కన్య, తుల, ధను, మీనలగ్నములందునూ మంచిది.

**పడవలను నీటిలో దింపుటకు :–** 2, 5, 7,10,11,13 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందునూ; అశ్వని, మృగ, ఆర్తే, మఖ, పుబ్బ, హస్త, చిత్త, విశా, మూల, పూ.షాఢ, పూ.భాద్ర, రేవ నక్షత్రములందునూ మేష, మిథున, కర్కా, తుల, మకర, మీన లగ్నములుమంచివి.

**లాంచీలు, క్రొత్త పడవలు ప్రయాణమునకు :–** 2, 3, 5, 7, 10, 13 తిథులందు, సోమ, బుధ, గురు శుక్రవారములందునూ; అశ్వ, మృగ, పున, పుష్య, హస్త, అనూ, జ్యేష్ఠ, శ్రవ, ధని, రేవనక్షత్రములందునూ ; మేష, వృష, కర్కా, కన్య, తుల, ధను, మీన లగ్నములు, లగ్నబలము, పంచమ శుద్ధి, ఆనందాది యోగాలు, శకున బలము ఉన్నచో శుభము.

**చేపల చెరువులు త్రవ్వుటకు :–** 2,3,5,7,10,11 తిథులందునూ; సోమ, బుధ, గురు; శుక్రవారములందునూ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, స్వాతి, ఉ.షాఢ, శ్రవ, ధని, ఉ.భా, రేవ, నక్షత్రములందునూ ; కర్కా, ధను, మకర, మీనలగ్నములందు శ్రేష్ఠము.



## మరణ సంబంధ విషయములు

రోహిణి, మృగ, పున, మఖ, ఉత్త; చిత్త, విశా, ఉ.షాఢ, ధని, శత, పూ.భా, ఉ.భా, రేవ నక్షత్రములందునూ; 1,2,6,8,11,12,13, 14, 30 (అమావాస్య) తిథులందునూ, ఆది, మంగళ, శుక్ర, శనివారములందు మరణం కలిగినచో దోషము. కేవలం తిథి వలన దోషము లేదు. తిథి వారము వలన స్వల్ప దోషము, తిథి, నక్షత్రము వలన అర్ధదోషము, వార, నక్షత్రమువలన త్రిపాద దోషము. తిథి, వార, నక్షత్రము వలన సంపూర్ణ దోషము, రోహి, మృగ, మఖ, చిత్త, నక్షత్రములందు మరణించిన మూడుమాసములు, కృత్తిక, పున, ఉత్తర, విశా, ఉ.షా నక్షత్రములందుమరణించిన ఆరుమాసములు, గృహ మందు మరణించినచో ఆ గృహము విడువవలెను. తదుపరి ఉదక శాంతులు చేసుకొని ఇంటిలో ప్రవేశించవలెను.

**ఈ విషయము మృతకాల చక్రానుసారము ఆచరించవలెను.**

మరణించిన రోజున రవి ఏనక్షత్రమునందుండునో ఆ నక్షత్రముమొదలు ఈశాన్య దిక్కునుండి తూర్పు దిశగా మూల దిక్కులందు మూడు నక్షత్రములనూ, 4 దిక్కులందు నాల్గేసి నక్షత్రములందునూ ఆరోహణావరోహణాక్రమముగా చక్రములలో వ్రాయవలెను. రవి లగాయతు లెక్కింపగా మృత కాల నక్షత్రము చక్రమునకు మధ్యన ఉంటే ఆ గృహము 4, 5 రోజులలో విడువవలెను. దానికి చుట్టూ ఉన్న ప్రహరీలో ఉన్న యింటి వారికి దోషం లేదు. దోష నక్షత్రములందు మరణించిననూ ఆ యిల్లు ఖాళీ చేయనవసరం లేదు. ఇంటిలో గాక యింటి యొక్క ఖాళీ స్థలములలోను, బయట ప్రదేశాలందు చెడు తిథి, నక్షత్ర, వారాలందు మరణం కలిగినను గృహం ఖాళీ చేయనవసరం లేదు.





## మరణ సంబంధ జాతాశౌచ (మైల) విషయాలు

గర్భం ధరించి 3, 4 మాసాలలో నష్టమైన గర్భస్రావం, 5, 6 నెలల్లో నష్టమైన గర్భపాతం, 7, 8, 9, 10 నెలల్లో జననం అని అంటారు. గర్భస్రావమైన తల్లికి 3 రోజులునూ, తండ్రికి స్నానంతో శుద్ధి అగును.

గర్భ పాతం 5 వ నెలయందైన తల్లికి 6 రోజులు, తండ్రికి జ్ఞాతులకు 3 రోజులు పురుడు, 7 వ నెల నుండి 10 వ నెల లోపున ప్రసవించిన తల్లి దండ్రులకు జ్ఞాతులకు 10 రోజులు పురుడు (మైల).

శిశువు గర్భమునందే మరణించి జన్మించిన తల్లిదండ్రులకు జ్ఞాతులకు 10 రోజులు పురుడు, మృతశౌచము లేదు. శిశువు ప్రాణముతో ప్రసవించిన బొడ్డు కోయగానే మరణించిన తల్లికి 10 రోజులు, జ్ఞాతులకు 3 రోజులు పురుడు, మరణ మైల స్నానముతో శుద్ధి అగును. 19 రోజులలో మరణించిన మిగిలిన పురుటి రోజులను బట్టి స్నానముతో మైల శుద్ధి అగును.

7 తరములలోపు జ్ఞాతులకు పురుడు మైలు గాని మరణ మైలు గాని 10 రోజులు పట్టాలి. 8 వ తరం నుండి 14 తరముల వరకు సోదరులని పేరు. వీరికి 3 రాత్రులు పురుడు మైలు గాని మరణము మైలు గాని పట్టాలి.

కుమార్తెలు అందుముందుగా మనమడు పుట్టిన తల్లి తండ్రి అమ్మమ్మలకు 3 రోజులు. సాధారణంగా అన్ని కులముల వారికి మరణమునందు 10 రోజులు మైలు అని ధర్మ శాస్త్ర నిబంధన కర్తలు యుగాంతరధర్మములని వ్యవస్థను చేసిరి. గాన ఆ శాస్త్ర సాంప్రదాయములు ఆచరించుట మన కర్తవ్యం.

శిశువు జన్మించినది మొదలు దంతాలు వచ్చే లోపున మరణం కలిగిన తల్లి దండ్రులకు 3 రోజులు మైలు, జ్ఞాతులకు స్నానంతో శుద్ధి యగును. దంతములు వచ్చిననాటినుండి కేశ ఖండనం జరిగే లోపున (3సం॥) మరణించిన తల్లి తండ్రులకు 3 దినములు, జ్ఞాతులకు 1 రోజు మైలు.

3 సంవత్సరాల నుండి ఉపనయనమగు లోపున మరణము కలిగిన తల్లి దండ్రులకు జ్ఞాతులకు 3 రోజులు మైలు, ఉపనయనం కాని పురుషుడు, వివాహం కాని కన్య, మృతినొందినచో నాటినుండి పక్షిణీదార్లకు ఎప్పుడు విన్ననూ స్నానము మాత్రమే, ఉపనయనం అయిన పురుషుడు, వివాహం అయిన స్త్రీ మరణించినచో ఆ రోజు నుండి పక్షిణీదార్లకు పక్షిణీ కలుగును. అదే పురుషుడు గతించినచో తల్లిదండ్రులకు జ్ఞాతులకు 10 రోజులుమైలు, 3 సం॥లు దాటి వివాహం లోపుగా కన్య మరణించిన తల్లి దండ్రులకు, జ్ఞాతులకు 1 రోజు మైలు పక్షిణీ దార్లకు స్నానం.

పక్షిణీ దార్లకు మైలు :– మరణించిన రోజునుండి మూడురోజు లోపుగా ఎప్పుడు విన్ననూ పక్షిణీదార్లకు 3 రాత్రులు శేషంతో శుద్ధిఅగును. 3 రోజులు దాటి 10 రోజులు లోపుగా విన్నది లగాయతు 36 గంటలు పక్షిణ్యాశౌచం పట్టవలెను. పక్షిణ్యాశౌచ విషయంలో ప్రాంతాలవారిగా ఆచారాలు కనిపించుచున్నవి. 3 రోజులు అచ్చటున్నవారికి పక్షిణీరోజులు దాటిన తరువాత 10 రోజుల లోపున వింటే స్నానం చాలుననియు కొందరు, 3 రోజులు దాటిన తరువాత వింటే 1 రాత్రి ఒక పగలు మైలు, 24 గంటలు అని ఆచారం ఉన్నది. ఏమైననూ వారి వారి ప్రాంతీయ ఆచారాలను బట్టి ఆచరించాలి.

10 రోజుల మైలు కాని 3 రోజుల మైలు కాని ఆ కాలము దాటిన తరువాత తెలిసినచో స్నానంతో శుద్ధియగును. పక్షిణ్యాశౌచము దశ రాత్రులు తర్వాత వింటే స్నానముతో శుద్ధి అగును. పక్షిణ్యాశౌచము అక్కడ ఉన్న సమయములందు ఉన్నచో ఆచరణ చేయుదురు. **ముందుగా ఒక అశౌచము తెలిసిన తదుపరి మరొక అశౌచము తెలిసిన ముందుగా తెలిసిన అశౌచముతో కలసి పోవును.**

**పక్షిణీ దారులు:–** పిన తల్లులు, పెదతల్లులు, మేనమామలు వీరి సంతానం స్త్రీ పురుషులు, మాతామహి, మాతామహులు, పినతండ్రి, పెదతండ్రి వీరి స్త్రీ పురుష సంతానాలు, అన్నదమ్ములు, వీరి స్త్రీ పురుష సంతానాలు, కుమార్తెలు, అల్లుండ్రు, కుమార్తెల సంతానాలు, అన్నదమ్ములు, వీరి పురుష సంతానాలు, కుమార్తెలు, అల్లుండ్రు, కుమార్తెల సంతానాలు, అక్క చెల్లెండ్ర భర్తయు, భార్యకు సోదరులు, అత్త మామలకు వీరు పక్షిణీ దారులు.

**పక్షిణీ దారులు కాని వారు :–** స్త్రీ లకు పిన తండ్రి భార్యలు, భర్త సోదరుని కుమార్తెలు, అన్నదమ్ముల భార్యలు, అక్కచెల్లెండ్ర భర్తలు, మేనమామ భార్యలు, వీరికి పక్షిణీ ఆచరించుసాంప్రదాయము కలదు.

తల్లిదండ్రులకు గాక, తక్కిన వారలకు కర్మ చేయునపుడు 10 రోజుల మధ్యలో అమావాస్య , సంక్రాంతికాని సంభవించెనేని ఆ పిమ్మట, చేయదగిన సకల తోదక, వాసోదక, పిండ దానములను తత్కార్యదినమున చేయవలెను.

**సూతకం:-** తల్లిదండ్రులకు 1 సంవత్సరం, సవతి తల్లికి 6 మాసాలు, భార్యకు 3 మాసాలు, (తల్లి దండ్రులకు కాకుండా యితరులకు కర్మ చేసిన యెడల సంవత్సర సూతకము ఉండదు)



## వివాహముహూర్తమునకు బలాబలాలు

వివాహం మానవునకు నూరేళ్ళపంట, వివాహం నుండి మానవునికి అనేక బంధాలు ఏర్పడును. అట్టి వివాహమునకు మన ప్రాచీనమహర్షులు అనేక నియమాలుగా ముహూర్తములు నిర్ణయించిరి. గాని ప్రస్తుతం వాటిలో కొన్నింటిని విస్మరించి ముహూర్త నిర్ణయాలు చేయుట వలన బార్యభర్తలు సఖ్యత కోల్పోయి విడిపోవుట ప్రస్తుత కాలంలో చాల ఎక్కువగా కనిపిస్తున్నది.

కావున వివాహముహూర్త నిర్ణయం చేసేటప్పుడు ఈ క్రిందిజాగ్రత్తలు తీసుకొని ముహూర్త నిర్ణయం చేసినచో దంపతులు తప్పక చిరకాలం నివసించి భోగభాగ్యాలు, కుటుంబ సౌఖ్యములు, సత్సంతానము పొందగలరు.

1. వధూవరుల జన్మ లేదా, నామ నక్షత్రాలను బట్టి వివాహముహూర్తమునకు తారాబలం చూడాలి.

2. కన్యా దాతలకు కూడా ముహూర్తమునకు తారాబలం చూడాలి.

3. వధూవరుల తారలకు పరస్పరం తారాబలం చూడాలి.

4. ముహూర్తమునకు నిర్ణయింపబడిన తిథి, వార, నక్షత్రములచే చూడాలి. అన్య నక్షత్రాలు చూడరాదు. కొంత మంది సోమవారం వ్రాస్తున్నారే కాని శాస్త్ర సమ్మతం కాదు. అనుభవంలో ముహూర్తములో సత్ఫలితములు ఇచ్చుటలేదు.

5. లగ్న బలం చూడాలి. 6, 8, 12 రాశులందు చంద్రుడు ఉండరాదు.

6. లగ్నము గురు, శుక్రులు చూస్తుంటే ఈ దోషము స్వల్పం.

7. శుక్రుడు ఆరింట ఉండరాదు. గురు దృష్టి లగ్నానికి గాని శుక్రునకు గాని ఉన్నచో మంచిదని కొందరి నిర్ణయం.

8. అష్టమమందు కుజుడు ఉండరాదు. ఇందు రాజీ కుదరదు.

9. సప్తమమునందు అష్టమమున ఏ గ్రహం కూడా ఉండరాదు. కొందరు శుభగ్రహాలైన గురు, బుధ, శుక్రులు, పూర్ణ చంద్రుడు ఉన్నచో దోషములేదనుచున్నారు. కాని తగదు.

10. ముఖ్యంగా వివామమునకు వివాహ చక్ర శుద్ధి తప్పక చూడాలి. ప్రస్తుతం దీనిని ఎవ్వరు చూచుట లేదు.



## వివాహ చక్రం

రవి యున్న నక్షత్రం నుండి వివాహ నక్షత్రం వరకు లెక్కింపగా

| | | |
|---|---|---|
| 3 హాని | 12వైధవ్యం | 21 వ్యభిచారం |
| 6 శుభం | 15 కులవృద్ధి | 24 ధనవ్యయం |
| 9 పుత్ర హాని | 18 మరణం | 27 సంపద |

## వివాహమునకు త్రిజ్యేష్ఠ విచారణ

తొలిచూలు వరుడు, తొలి చూలు వధువు, జ్యేష్ఠ మాసము, వీటి మూడింటికి త్రిజ్యేష్ఠ అని పేరు. దీనిలో ఒక జ్యేష్ఠ శుభం. రెండు జ్యేష్ఠలు మధ్యమం, మూడు జ్యేష్ఠలు హానిని కలిగించును.

**లగ్నబలాలు :-** వివాహలగ్నమునందు బుధ, గురు, శుక్రులు ఉంటే అగ్ని దూదిని కాల్చినట్లు సమస్త దోషములు పోగొట్టును. వివాహలగ్నమునకు బుధ, గురు, శుక్రులలో ఏ ఒక్కరైన స్వోచ్ఛ, మూల, మూలత్రికోణం, మిత్ర స్వక్షేత్రములందునూ 1, 4, 5, 9, 10 ఈ స్థానములందు ఉన్నచో అసంఖ్యాకమగు దోషములను పోగొట్టును.

**పార్వతీ పరమేశ్వర యోగం :-** లగ్నమందు గురుడు, లాభ రాశియందు కుజుడు, ధన స్థానమందు రవి యుండిన పార్వతీ పరమేశ్వర యోగం అందురు. ఇట్టి ముహూర్తమున వివాహం జరిపించిన ఆ దంపతులు చిరకాలం జీవించి భోగభాగ్యములు సుఖ, సంతోషములు తప్పక పొందుదురు.

**లక్ష్మీనారాయణ యోగం :-** లగ్నమందు గురుడు తృతీయ మందు శుక్రుడు, ఆరింట రవి, తొమ్మిదింట కుజుడు ఉండిన లక్ష్మినారాయణ యోగము అందురు. ఇట్టి ముహూర్తకాలంబున వివాహం గావించిన ఆ దంపతులు సుఖకరంగా జీవితాంతం జీవించగలరు.

పై యోగాలు లగ్నమునకు ఆయా గ్రహములు శుభులైనపుడు మాత్రమే నని గ్రహింపవలెను.

## శ్రీ గోరస వారి భవిష్య పంచాంగము

**2000 నుండి 2025 వరకు**

**మొట్టమొదటి దృగ్గణిత భవిష్య పంచాంగము**

**ఈ పంచాంగంలో తిథి, నక్షత్ర, యోగవములఅంత్యాన్ని, వారాన్ని, (ఇంగ్లీషుతేదీలను) గ్రిగోరియన్ కాలెండర్ తేదీలను 26 సంవత్సరాలకు ఇవ్వడం జరిగింది. కరణాన్ని ఎలా వేసుకోవాలి -అనే విధానాన్ని, ప్రతీ నక్షత్రానికి వర్జ్యాన్ని కట్టే విధానాన్ని, వారంలో ఏర్పడే దుర్ముహూర్తాలను నిర్ణయించే విధానాన్ని నిర్దేశించాము. రాహుకాల, గుళికకాల, యమ గండాది నిర్ణయ విధానాన్నిసూచించాము. శుభకాలచక్రం ఇచ్చాము. అందులో వర్జ్య సమయాన్ని తీసేస్తే మిగిలిన సమయాలను నిర్బంధంగా వాడుకోవచ్చు. ఏ యే మాసాలలో ఏ యే పండుగలు వస్తాయో చెప్పడం జరిగింది. వాటిని ప్రతీసంవత్సరం పంచాంగంలోనే నిర్ణయించాలి. కాలక్రమానుగతమైన ఇప్పటివరకుఉన్న ఎనిమిదివిధాల శకాల ప్రారంభ దినాలను ఇచ్చాము. లగ్న స్ఫుటాన్ని కనుగొనే విధానం జాతకాలు వేసుకొనే వారికోసం ఇవ్వడం జరిగింది. లగ్నభుక్తి పట్టికలు కూడా ఇవ్వడం జరిగింది. తెలుసుకోవాలని తపన ఉన్న వారికోసం సూర్యభుక్తి వేసుకొనే విధానం జోడించాము. కావున పండితుల వద్ద అత్యవసరంగా ఉండదగినది.**

**ఇంకా పంచాంగ రచనకు వీలైన 26 సంవత్సరాల రాజాదులు, భారతదేశంలో కనిపించే గ్రహణమధ్య కాలం, గ్రహాల నిరయణ రాశి ప్రవేశాలు, సూర్య నక్షత్ర ప్రవేశాలు, కందాయ ఫలాలు, ఆదాయ వ్యయాలు, సంవత్సర ఫలాన్ని నిర్ణయించే విధానం, మాస ఫలితాలను నిర్ణయించే విధానం, ప్రతిసంవత్సర మౌఢ్యమి యివ్వడం జరిగింది. వీటిని విజ్ఞులు సమయానుకూలంగా గ్రహించగలరని కోరుతున్నాము.**

**వెల రూ 411-00 మాత్రమే, పోస్టేజీ అదనము**

## విశ్వకర్మ వాస్తు విద్యా రహస్యాలు

**రచయిత : దైవజ్ఞ గోరస వీరభద్రాచార్యులు**

ఈ గ్రంథంలో కాలాంతరమున మరుగున పడిన అనేక వాస్తువిద్యా రహస్యాలు వివరించబడినవి. వాస్తుశాస్త్ర ప్రయోజనం, చతుర్విధ వాస్తువులు, వాస్తుపురుషుని స్వరూపం, భూమిపై సూర్యగోళ ప్రభావం, వాస్తు పదాలు - సైన్సుతో వాటి సంబంధం, వీధిశూలలు - సైన్సుతో వాటి సంబంధం, భూమిలోపల శల్యాలు తెలుసుకొనే పద్ధతి, గ్రామార్వణ, ధన ఋణ పద్ధతులు, వాస్తులో నామనక్షత్ర ప్రాధాన్యత, స్థల పరీక్ష, భూమిలక్షణాలు, ఆయవములు, గృహత్రయ విభాగం, నీటివాటములు, మరుగుదొడ్లనిర్ణయం, శంకుస్థాపనా పద్ధతులు, గృహారంభం చేసే సమయాలు, ముఖద్వారాల ననుసరించి శంకుస్థాపనా పద్ధతి, గృహంలో వృక్షాలనిర్ణయం, గృహాలదోషాలు- వాటినివారణలు, వాస్తుశాస్త్రంలో అతిముఖ్యమైన సూత్రాలు, యంత్ర పూజనా విధానం, యంత్రప్రాణ ప్రతిష్ఠాపనా విధానం, వివిధ చక్ర సుద్ధులు, నవవర్గ గణిత పథకాలు మొదలగు విషయాలుగూర్చి 350 పేజీలతో ప్రచురింప బడింది.

**వెల రూ. 250/- మాత్రమే.**

## మయవాస్తు

విరాట్ పురుషుని పంచముఖముల నుండి ఐదుగురు శిల్పబ్రహ్మలు ఆవిర్భవించారు. వారే వాస్తుశాస్త్రమును రచించి యంత్ర తంత్రాది మహావిషయములను అందించిన మహాఘనత శిల్ప ఋషులదే. మయబ్రహ్మ విరచితమైన మయమత వాస్తుశాస్త్ర ఆధారంగా ఈ మయవాస్తు రూపాందించబడింది. జ్యోతిష వాస్తు విద్యార్థులందరి వద్ద ఉండవలసిన గ్రంథము. **వెల రూ. 80/- మాత్రమే.**



### తిథులు - చేయదగిన కార్యములు

**పాడ్యమి:-** అధిపతి- అగ్ని ; వివాహం, యాత్ర, చౌలం, సీమంతం, దేవతాప్రతిష్ఠ, గృహప్రవేశం, వృక్షచ్ఛేదన మొదలగు శుభకర్మలు.

**విదియ** :- అధిపతి - విధాత ; వాస్తుకార్యాలు, ప్రతిష్ఠ, యాత్ర, వివాహం, గృహకర్మలు, స్వర్ణ, రజతభూషణ ధారణ, సమస్తసృష్టి కర్మలు.

**తదియ:-** అధిపతి -పార్వతి ; సంగీతం, శిల్పం, విద్యారంభ, సీమంత, అన్నప్రాశన, చౌల, గృహప్రవేశ, పశుక్రయ విక్రయాలు, ప్రతిష్ఠలు.

**చవితి :-** అధిపతి- గణేశః ; ఆయుధ, అగ్నిసంబంధ, శస్త్ర మారణాద్యఖిల కర్మలు.

**పంచమి** :- అధిపతి- ఆదిశేషుడు ; చర, స్థిర, రూపాలైన సమస్త శుభాలు, ఋణాలు ఇవ్వడం, మంగళోత్సవాలు, ఉపనయనం, వివాహం, గృహశాంతిక పౌష్టికాలు.

**షష్ఠి :-** అధిపతి- కుమారస్వామి ; వస్త్ర అలంకార క్రియలు, యుద్ధ సామాగ్రి, పౌష్టిక క్రియలు చేయవచ్చును.

**సప్తమి :-** అధిపతి- రవి ; విదియ , తదియ, పంచమీ తిథులలో చెప్పబడ్డ కార్యాలు చేయవచ్చును.

**అష్టమి :-** అధిపతి- మహేశః ; వాస్తు, శిల్ప, నృత్య క్రియలు, స్త్రీ, రత్న, అలంకార క్రియలు, యుద్ధ సంబంధమైన క్రియలు, అఖిల లేఖనాలు, కృషి, వాణిజ్యము మొదలగునవి.

**నవమి :-** అధిపతి- అష్టవసువులు ; అగ్నిమూలక కర్మలు, మిత్రభేదాదికాలు, సంభాషణ, ఘాతుక కర్మలు, విరోధాలు, మొదలగునవి.

**దశమి :-** అధిపతి- దిగ్గజములు ; 2,3,5,7 తిథుల్లో చెప్పబడినవి చేయవచ్చును. శాంతి పౌష్టికాదికాలు, ప్రాసాదన స్థాపన మొదలగు కార్యాలకు మంచిది.

**ఏకాదశి** :- అధిపతి- యముడు ; వ్రతాలు, ఉపవాసాలు, అన్ని ధర్మకర్మలు, దేవతోత్సవాలు, వాస్తు, యుద్ధ కర్మలు, వివాహ, కృషి, వాణిజ్య, భూషణాదికాలు, శిల్ప, నృత్య, గృహ కర్మలు చేయవచ్చును..

**ద్వాదశి :-** అధిపతి- విష్ణువు ; శాంతి పౌష్టిక కర్మలు, శుభకర్మలు చేయవచ్చు, యాత్ర, అన్న ప్రాశన చేయరాదు.

**త్రయోదశి:-** అధిపతి- మన్మథుడు ; 2,3,5,10 తిథులకు చెప్పిన శుభ కర్మలు చేయవచ్చును.

**చతుర్దశి :-** అధిపతి- కలిపురుషుడు ; అగ్ని ప్రధానమైనవి, ఉగ్ర కృత్యాలు, యుద్ధ, శస్త్ర, అస్త్ర, లోహ, వ్రణ క్రియలు చేయవచ్చు.

**పూర్ణిమ :-** అధిపతి- చంద్రుడు ; యజ్ఞ క్రియలు, మంగళ కృత్యాలు, వాస్తుకర్మలు, వివాహ, శిల్ప, అలంకార, దేవతా ప్రతిష్ఠలు చేయవచ్చును. అభ్యంగన, క్షౌర క్రియలు చేయరాదు.

**అమావాస్య -** అధిపతి - పితృదేవతలు ; శుభ కర్మలు చేయరాదు, పితృకర్మలు చేయాలి.

### వారములు - చేయదగిన కార్యములు

**ఆదివారము:-** ఉద్యోగములో చేరుట, మంగళ కార్యాలు , లోహం, కలప, చర్మ, ఊకపనులు, ఉత్సవాలు, యుద్ధం, నృపాభిషేకం, ధ్యాన క్రియలు, అస్త్ర కర్మలు, వ్యవసాయపు పనులు ప్రారంభించడం, ఔషధ సేవనం, వైద్యుని సంప్రదించడం, మంత్ర తంత్రాలు, ఉపదేశాలు, ఉల్లి ,పొగాకు , మిర్చి, మొదలగు తోటలు వేయడం, ఉత్తర దిక్కు ప్రయాణం, కెంపు ధరించడం చేయవచ్చును.

**సోమవారము:-** ముత్యం, స్ఫటికం, నూతులు, కాలువలు, చెఱువులు, కాలువలు, జలం, ఉపనయనం, భూమి, పైకప్పులు, సంగీత, నృత్య, నాటకాలు, స్తంభ ప్రతిష్ఠ, భూసంబంధ కార్యాలు, వెండివస్తువులు ఉపయోగించడం, తెల్లని వస్త్రములు ధరించడం, ముత్యాలు ధరించడం, దక్షిణ దిక్కు ప్రయాణం, కృషి, సమస్త వాస్తు కళలు చేయవచ్చును.

**మంగళవారం:-** విష, అగ్ని, ఆయుధ, ఉగ్ర, అసత్య క్రియలు, వెండి, బంగారం, రాగి, ఇత్తడి, ఇనుము ధాతువులు కరిగించడం; కోర్టువ్యవహారాలు, ధైర్య సాహస విషయాలు, కందులు, వేరుశెనగ వంటి ధాన్యాలు సాగుచేయడం, తూర్పుదిక్కుకు ప్రయాణం, పగడపు ఉంగరం ధరించడం చేయవచ్చును.

78

**బుధవారం:-** బంగారం మొదలైన నగలు చేయడం, వాహనం, శిల్పం, విద్య, రాజీలు, వివాహం, వ్యాపారం, క్రయ విక్రయాలు, గణితం, రత్నాభరణ ధారణ, దస్తావేజులు, నూతన వ్యాపారాలు, యుక్తిగా కార్యాలు నిర్వర్తించుట, చిత్ర, శిల్ప, గణిత శాస్త్ర, వ్యాకరణ విద్యలనభ్యసించుట, అరటి, కొబ్బరి, మామిడి తోటలు పెంచడం, పెసలు మొదలైన పైర్లు వేయడం, పడమటకు ప్రయాణం మంచిది.

**గురువారం:-** యజ్ఞయాగాది క్రియలు, వివాహాదిశుభకార్యాలు, వైదిక కార్యాలు, నూతన విద్యారంభ, వృక్షదోహద క్రియలు, అలంకార ధారణ క్రియలు, యుద్ధారంభం, అక్షరాభ్యాసం, తీర్థయాత్రలు, గురువులనుదేవతలను పూజించుట, శెనగలు, చెరుకు, ప్రత్తివంటి వ్యాపారాలు ప్రారంభించడం, పుష్యరాగం ధరించడం, మొదలగువాటికిమంచిది.

**శుక్రవారం:-** స్త్రీ సంబంధ క్రియలు, ముత్యం, వజ్రం, వైఢూర్యం, ఆభరణ ధారణ, సుగంధ శయ్యాభరణాలు, ఉద్యోగ కృషి, వ్యవసాయం, కాలువలు, వివాహం, శోభస్కరమైన కార్యాలు, నూతన వస్త్రములు ధరించుట, రాజకీయ రంగ ప్రవేశం, ధాన్య సంబంధపు పనులు ప్రారంభించడం, సాహిత్య విషయాలు, కళలు నేర్చుకోవడం, ఉత్తరం వైపు ప్రయాణమునకు మంచిది.

**శనివారము:-** చెక్కుట, సీసపు పనులు, దీక్షావలంబన, తగరం, లోహపు పనులు, స్థిరమైన పనులు, గృహ నిర్మాణాది పనులు, ఆవులు, గెదలు మొదలగునవి, ఇనుమునకు సంబంధించినవి, పాపకార్యాలు, అసత్య వాదన, దాసదాసీలను చేర్చుకొనుట మొదలగు పనులకు మంచిది. ఆయుధ నిర్మాణం, మోసం, దుష్ట సంభాషణ, శనిదోష పూజాది కార్యక్రమాలకుమంచిది.



## నక్షత్రములు - చేయదగిన కార్యములు

**అశ్వని :-** అధిపతి – అశ్వనీ దేవతలు ; అన్న ప్రాశన, నామ కరణ, చౌలవము, ఉపనయనము, అశ్వ శాస్త్ర గ్రహణ, వేద శాస్త్ర అభ్యాసము, తైలాభ్యంగన, నవవస్త్ర ఆభరణ ధారణ, రాజ్యాభిషేకము, ఆందోళిక రథా రోహణము, వాస్తు కర్మ, చిత్ర లేఖన, కృషి ప్రయోగ, బీజావాపనము, నారికేళ స్థాపన, యాత్రా రంభ, ప్రేత శ్రాద్ధము, వైద్యము మొదలగు పనులు ప్రారంభించుటకు మంచిది.

**భరణి :-** అధిపతి – యముడు ; ఈ నక్షత్రమున శత్రువులతో యుద్ధమునకు, విష ప్రయోగమునకు, జల ప్రవేశమునకు, నిధి నిక్షేపములు తీయుటకు, అంజనము వేయుటకు, బిల ప్రవేశమునకు, అభిచార ప్రయోగమునకు, మాయా కృత్యములు చేయుటకు, ద్యూతము, చోర విద్యాభ్యాసమునకు, ద్రవ్య అపహరణకు, క్రూర దాన, బీజావాపనము, ముళ్ళుగల వృక్షముల స్థాపనము, సేవకులను నియమించు కొనుటకు, గయ మొదలైన చోట శ్రాద్ధము పెట్టు టకు మంచిది.

**కృత్తిక :-** అధిపతి – అగ్ని ; క్షుర కర్మ చేయరాదు, విష ప్రయోగమునకు, ధాతు వాదమునకు, సువర్ణ, కాష్ఠ, లోహ కర్మలు చేయుటకు, పర ద్రవ్యము అపహరించుటకు, అప్పు తీర్చుట, ధనధాన్యములు దాచుట, పశువులను అమ్ముటకు, అంజన విద్యాగ్రహణమునకు, ముండ్ల చెట్లు స్థాపించుట మొదలగు పనులకు మంచిది.

**రోహిణి :-** అధిపతి – బ్రహ్మ ; ఈ నక్షత్రమున సీమంత, పుంసవన, నామకరణ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, వేద శాస్త్ర అభ్యాసము, నవమావర్తన, వివాహ, తైలాభ్యంగన, నూతన ఆభరణ ధారణ, రాజ్యాభిషేక, సింహాసనాధివత్య, ఆందోళికా రోహణ, వాస్తు, పుర, గ్రామ, గృహ, దేవతా ప్రతిష్ఠ, యజ్ఞ హోమ, దాన, శాంతి, పౌష్టిక, ధనధాన్య సంగ్రహము, కూపారంభాది శుభ కార్యములకు మంచిది.

**మృగశిర :-** అధిపతి – చంద్రుడు ; ఈ నక్షత్రమున వివాహ, ఋతు, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, అక్షర స్వీకార, వేదశాస్త్ర అభ్యాసము, తైలాభ్యంగనము, ముత్యములతో చేసిన ఆభరణ ధారణ, పట్టాభిషేక, గజ, తురగ, ఆందోళికాదులు, దృష్ట్యా రంభ, బీజా వాపనాది శుభ కర్మలకు మంచిది.

79

**ఆరుద్ర :-** అధిపతి – శివుడు ; శత్రు గ్రహణమునకు, అగ్ని ప్రయోగమునకు, అక్షర గ్రహణమునకు, అస్త్ర శాస్త్ర అభ్యాసమునకు, చోర విద్యకు, భూత, గ్రహో చ్ఛాటనకు, మంత్ర, యంత్ర ప్రయోగమునకు, శివ ప్రతిష్టకు, సకల తీర్థముల యందు శ్రాద్ధ కర్మ చేయుటకు ప్రశస్తము.

**పునర్వసు :** అధిపతి – అదితి ; పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణవేధ, చౌలవ, ఉపనయన, అక్షర స్వీకార, వేద శాస్త్రఅభ్యాస, తైలాభ్యంగన, చిత్ర, వస్త్ర ఆభరణ ధారణ, పట్టాభిషేక, సింహాసనాధిపత్య, శయ్యా లంకార, గ్రామాది వాస్తు సంబంధ కార్యములకు, గృహ ప్రవేశము, వైద్యము, యాత్ర మొదలగు వాటికి మంచిది.

**పుష్యమి :-** అధిపతి – గురుడు ; పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, క్షురకర్మ, క్షుర గ్రహణ, భృత్య గ్రహణ, పశువులు కొనుట, పొలం పనులు చేయుట, యాత్రలు, వైద్యము, నవీన ఆభరణ ధారణ, రాజ్యాభిషేక, సింహాసనాధిష్టాన, ఆందోళికారోహణ, అశ్వారోహణ, గజా రోహణ, వాస్తు కర్మ, గ్రామ, పుర ప్రవేశము, యజ్ఞము, వ్రతము, ఉపదేశము పొందుట, కుల వృత్తిని అభ్యసించుట, చెరకు నాటుట మొదలగు వాటికి మంచిది.

**ఆశ్లేష :-** అధిపతి – సర్పములు ; అభిచారము, విష ప్రయోగము , యుద్ధ ప్రయాణము, బంధ విమోచనము, అబద్ధమాడుట, అస్త్ర, శస్త్ర అభ్యాసము, మాయా ప్రయోగము, వాపీకూప తటాకాది ప్రారంభములయందు మంచిది.

**మఖ :-** అధిపతి – పితృదేవతలు ; వివాహము, మంత్ర తంత్ర ప్రయోగము, వాపీకూప తటాకాదులు నిర్మించుట, గయాదులందు శ్రాద్ధ పితృ తర్పణము మొదలగు పనులు చేయుటకు ప్రశస్తము.

**పూర్వ ఫల్గుణి :-** అధిపతి – భర్గుడు ; అక్షరాభ్యాసము, అస్త్ర శస్త్ర అభ్యాసము, మంత్ర ప్రయోగము, చోర విద్యా, ద్యూత విద్య, మద్యపానము, శత్రోఛ్చాటన, నిక్షేపములు తీయుట, అంజన ప్రయోగములు, వాపీకూప తటాకాది స్థాపన, భూత ప్రయోగము, విషాగ్ని ప్రయోగము, వృక్షాది స్థాపన కార్యములకు మంచిది.

**ఉత్తర ఫల్గుణి :-** అధిపతి – అర్యముడు ; పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, వేద శాస్త్ర అభ్యాస, ఆవర్తన, వివాహాది, నూతన వస్త్ర ఆభరణ ధారణ, సింహాసనాధిపత్య, వాస్తు, పుర గ్రామ ప్రవేశము, రథా రోహణ, బీజా వాపనము మొదలగు పనులకు శుభము.

**హస్త :-** అధిపతి – రవి ; ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షురకర్మ, సమావర్తన, తైలాభ్యంగన, చిత్రవస్త్రాభరణ ధారణ, అశ్వారోహణ, శాంతి పౌష్టికము, ఉత్సవములు, ఆందోళిక, రథారోహణ, పశువులు కొనుటకు, బీజావాపనము, రత్నములు కొనుటకు, మంత్ర శాస్త్రాభ్యాసమునకు, యాత్ర, అభిషేకము, వైద్యము, యజ్ఞ దీక్ష, రాజ్యాభిషేక, తటాక స్థాపన, రాజ దర్శనాదులకు శుభము.

**చిత్త :-** అధిపతి – త్వష్ట ; ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షుర కర్మ, సమావర్తవ, తైలాభ్యంగన, చిత్ర, వస్త్ర అభరణ ధారణ, అశ్వారోహణ, బంధనము, రథారోహణ, చిత్ర లేఖనము, నాట్యము, ఔషధ సేవనము, క్షుర కర్మ మొదలగునవి.

**స్వాతి :-** అధిపతి – వాయువు ; నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షుర కర్మ, సమావర్తవ తైలాభ్యంగన, చిత్ర, మౌక్తికాలంకార వస్త్ర అభరణ ధారణ, నృత్య గీత, వాద్యారంభ, గజా , ఆందోళికారోహణ, కృషి, బీజావాపన, శుభకార్యారంభములందు మంచిది.

**విశాఖ :-** అధిపతి – ఇంద్రాగ్నులు ; వ్యవసాయము, విత్తులు చల్లుట, నిధినిక్షేపములు తీయుట, వాపీకూప తటాకాదులు ప్రారంభించుటకు మంచిది.

**అనూరాధ :-** అధిపతి – మిత్రుడు ; పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షురకర్మ, సమావర్తవ, తైలాభ్యంగన, చిత్ర, వస్త్రాభరణ ధారణ, సువర్ణ సంగ్రహణ, రాజ్యాభిషేక, బీజావాపన, గృహ ప్రవేశ, శ్రాద్ధ, వైద్యము మొదలగు పనులకు మంచిది.

**జ్యేష్ఠ :-** అధిపతి - ఇంద్ర ; కర్ణ వేధ, క్షురకర్మ, విషాగ్ని ప్రయోగ, అభిచార, మంత్ర శాస్త్ర, శత్రు యుద్ధ, ద్యూత క్రియలకు మంచిది. చెడు వ్యవహారములకు అస్త్ర శస్త్రాభ్యాసము, భూతోచ్ఛాటనము, మంత్ర యంత్ర తంత్రములకు, భృత్యాదుల తీసుకొనుట, ద్రవ్యము అపహరించుటకు, పశుక్రయ విక్రయములు మొదలగు కార్యములకు ప్రశస్తము.

**మూల :-** అధిపతి - నిర్పృతి ; పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షుర కర్మ, సమావర్తవ, తైలాభ్యంగన, చిత్ర, మౌక్తికాలంకార వస్త్ర ఆభరణ దారణ, యజ్ఞ దీక్షా ప్రారంభ, వైద్య, ఆరోగ్య స్నాన, వ్యవసాయ, బీజా వాపన, నారికేళ, పనస, జంబూ వృక్షాది స్థాపన, వాపీకూప తటాక, బిల ప్రవేశ, భూతోచ్ఛాటన, మంత్ర ప్రయెగ, యాత్రా, శ్రాద్ధమునందు ప్రశస్తము.

**పూర్వాషాడ :-** అధిపతి- గంగ; గణితారంభము, గోవులను కొనుట, అస్త్రములు సేకరించుట, ధ్యానవము, చెరకు నాటుట, ముత్యములు , పగడముల సేకరణ, వాపీకూప తటాక జల స్థంబన, అద్వైత విద్యారంభ, విష ప్రయోగ, అభిచార, చోరగమన, జల ప్రవేశ, రుణవిమోచన కార్యములయందు ప్రశస్తము.

**ఉత్తరాషాఢ :-** అధిపతి- విశ్వేదేవతలు ; ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్రాభ్యాస, క్షుర కర్మ, సమావర్తవ, తైలాభ్యంగన, మౌక్తికాలంకార, వస్రాభరణ ధారణ, రాజ్యా భిషేక, పురగ్రామాది శంకుస్థాపన, ఆరోగ్యస్నానము మొదలైన వాటికి ప్రశస్తము.

**శ్రవణం :-** అధిపతి - విష్ణువు ; ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, కర్ణవేధ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్రఅభ్యాస, సమావర్తవ , మౌక్తికాలంకార, వస్త్ర , ఆభరణ ధారణ, రాజ్యాభిషేక, పురగ్రామాది ప్రవేశ, విష్ణుదేవతా స్థాపన, వ్రతారంభ, యజ్ఞాది పశు బంధన, హోమ శాంతి పౌష్టిక, గ్రహ మంత్రోచ్చాటన, మంత్రాభ్యాస, కృషి ప్రారంభ, బీజావాపన, శ్రాద్ధ, వైద్య, యాత్ర, క్షుర కర్మ, ఆరోగ్యస్నానము మొదలైన పనులయందు ప్రశస్తము.

**ధనిష్ఠ :-** అధిపతి - అష్టవసువులు ; నామకరణ, కర్ణవేధ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్రాభ్యాస, తైలాభ్యంగన, క్షీరకార్య, ఆరోగ్య స్నానము, వైద్యము, మౌక్తికాలంకార వస్త్రాభరణ దారణ, రాజ్యాభిషేక, గుఱ్ఱము మొదలగు వానిని ఎక్కుట, ఛత్ర చామరాదులను ఉపయోగించుట, దేవతా ప్రతిష్ఠ, గృహ ప్రతిష్ఠ, యాత్రారంభ, నృత్య గీత వాద్యారంభ, వ్యాపారాదుల యందు శుభము.

**శతభిషము :-** అదిపతి - వరుణుడు ; నామకరణ, కర్ణవేధ, అన్న ప్రాశన, చౌలవ, ఉపనయన, అక్షర స్వీకార, వేద శాస్త్రాభ్యాస, తైలాభ్యంగన, క్షౌర, వైద్య, ఆరోగ్యస్నాన, రాజ్యాభిషేక , గజ, అశ్వ ఆరోహణ , దేవతా ప్రతిష్ఠ, వ్యాపారము, వ్యవసాయము, అంజన ప్రయోగము మొదలగు పనులయందు శుభము.

**పూర్వాభాద్ర :-** అధిపతి- అజైకపాదుడు ; వాపి కూప తటాకాది ప్రారంభమునకు, నిధి గ్రహణము , మంత్ర, తంత్ర , యంత్ర ప్రయోగమునకు, ధాతు వాదమునకు, క్రూర కార్యములకు మంచిది.

**ఉత్తరాభాద్ర :-** అధిపతి- అహిర్బుధ్న్యుడు ; పుంసవన, సీమంత, నామకరణ, అన్నప్రాశన, చౌలవ, ఉపనయన, వివాహ, యాత్ర, వైద్య, అశ్వ, గజరథారోహణ, సింహాసనాధిపత్య, మంత్రగ్రహణ, సమస్త దేవతోపాసన, సమస్త వృక్షములు నాటుట, గృహము, గోపురారంభము మొదలగు సకల కార్యములు చేయుటకు శుభము.

**రేవతి :-** అధిపతి- పూషణుడు ; ఋతు, పుంసవన, సీమంత, నామకరణ, అన్న ప్రాశన, కర్ణ వేధ, చౌలవ, ఉపనయన, వివాహ, అక్షర స్వీకార, వేద శాస్త్ర అభ్యాస, క్షుర కర్మ, సమావర్తవ, తైలాభ్యంగన, చిత్ర, మౌక్తికాలంకార వస్త్ర ఆభరణ ధారణ, రాజ్యాభిషేక, తురగ గజ రథారోహణాదులకు, రాజదర్శన, సింహాసనాధిపత్య, విద్యాభ్యాస, వైద్య, నృత్య గీత వాద్య, శంకు స్థాపన, దేవతా ప్రతిష్ఠాపన, క్రయవిక్రయ, వ్యవసాయారంభ, నానాబీజ స్థాపనాదులకు, శుభకార్యములకు మంచిది.



## అభిముఖ నక్షత్రములు

భర, కృత్తి, ఆశ్రే, మఖ, పూర్వఫల్గుణి, విశాఖ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు వాపి(కోనేరు), కూప(బావి), తటాకాలు (చెరువులు) నిర్మించుటకు శుభము, నిధి నిక్షేపాలు దాచటానికి, ప్రవేశానికి గణితానికి మంచివి.

## సమస్త కార్యాలకు శుభనక్షత్రాలు

అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, మఖ, ఉత్తరఫల్గుణి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధా, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములలో సమస్త శుభకార్యాలు చేయవచ్చును.

## నక్షత్రాలకు క్షిప్రాది సంజ్ఞలు

**క్షిప్రః-** అశ్వ, హస్త ఇవి శీఘ్రంగా ఫలితాలనిస్తాయి, శిలలు, శాస్త్రజ్ఞానం, అలంకారం, నృత్యాది చతుష్షష్టి(౬౪) కళలకు మంచివి. గురువారం ప్రశస్తం.

**దారుణః-** ఆరుద్ర, జ్యేష్ఠ, ఆశ్రేష ఇవి భయాన్ని కలిగిస్తాయి. హింసకు సంబంధించిన కర్మ, భయంకర కృత్యాలు, విద్వేష, పశు, శిక్షణాదులకును శనివారం ప్రశస్తం.

**మృదు :-** చిత్త, రేవతి, మృగశిర, అనూరాధ నక్షత్రములు. వస్త్ర, క్రీడ, మిత్ర కృత్యాదులకు మంచివి. శుక్రవారం ప్రశస్తం.

**స్థిర (ధృవ) :-** రోహిణి, ఉత్తర ఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రములు. బీజావాపన, గృహారంభ, శాంతి, ఉద్యాపన, ప్రతిష్ఠాదులకు మంచివి. ఆదివారం ప్రశస్తం.

**ఉగ్రః-** భరణి, మఖ, పూర్వ ఫల్గుణి, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు మారణ, అగ్ని, కర్మలు, కపటకృత్యాలు, శస్త్ర, ఉగ్రాది కర్మలకు మంచివి. మంగళవారం ప్రశస్తం.

**చరః-** స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిష నక్షత్రములు . గజ, అశ్వాది అరోహణాదులకు, తోటలు, యాత్రాదులకు మంచిది. సోమవారం ప్రశస్తం.

## కరణాలు - చేయదగిన కార్యాలు.

### చరకరణాలు

**బవ :-** అధిపతి- ఇంద్రుడు ; శుభకార్యాలు, ధర్మ కార్యాలు, పుష్టిని కలిగించే కార్యాలు, వాణిజ్య, పశు, ధాన్య సంబంధమైన , శ్రౌత స్మార్తాది కర్మలు చేయవచ్చును.

**బాలవ :-** అధిపతి- బ్రహ్మ ; ధర్మ, స్నేహ, మంగళ కార్యాలు, ఉత్సవాలు, అన్న ప్రాశనాదులు, వాస్తుక్రియ, రాజ్యాభిషేకం, యుద్ధ క్రియలు చేయవచ్చును.

**కౌలవ :-** అధిపతి- మిత్రుడు ; కన్యావరణము, (కన్యా నిర్ణయమునకు) శుభకార్యాలు, స్నేహం. ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలకు సంబంధించిన పనులు, ఉపనయనం , అడవులను పెంచుట చేయవచ్చును.

**తైతుల :-** అధిపతి- అర్యముడు ; ముఖ్యులతో కలవడం, గృహ సంబంధ కార్యాలు, తోటలు , విగ్రహాలు, క్రయ విక్రయాలు, యాత్రా, బావులు, చెరువులు మొదలగు కార్యములకు మంచిది.

**గరజి :-** అధిపతి- భూమి ; కృషి, బీజావాపనం, ప్రాకారాలు కట్టడం, వ్యవసాయపు పనులు, జల సంబంధ క్రియలు మొదలగు కార్యములకు మంచిది.

**వనజ :-** అధిపతి- లక్ష్మి ; స్థిరకార్యాలు, వ్యాపారాలు, ధాతు క్రియలు.

**భద్ర :-** అధిపతి- యముడు ; శుభకార్యాలు, మంత్ర, శత్రు నాశనానికి, వధ, బంధన, అగ్ని, భేదన, ఉచ్చాటన నిర్వర్తించ వచ్చును. శుభకర్మలు చేయరాదు.

### స్థిర కరణాలు

**శకుని :-** అధిపతి- కలిపురుషుడు ; ఓషధులను గ్రహించడం, వ్యాధి నివారణ, ఔషధాలు తేవడం నూరడం, మంత్ర సాధన, మంత్రోపదేశం, పౌష్టిక క్రియలు, ఔషధ సేవ, గోసంబంధ క్రియలు.

**చతుష్పాత్ :-** అధిపతి- వృష (రాక్షసుడు) ; గోసంబంధ కార్యాలు, పితృ దేవతలను గూర్చి బ్రాహ్మణులకు దానమివ్వడం, రాజకార్యాలు చేయవచ్చును.

**నాగవము :-** అధిపతి- ఫణి ; దారుణ కర్మలు, ద్వేషకర్మలు చేయవచ్చును.

**కింస్తుఘ్నము :-** అధిపతి- వాయువు ; శుభకర్మలు, పుత్ర కామ్యాది యజ్ఞకర్మలు, శరీర పోషణ, వివాహాది మంగళ కార్యాలు, సిద్ధి కార్యాలు చేయవచ్చును.

## శుభకాల చక్రము

ప్రతిదినమునందు రాహుకాల, గుళికకాల, యమగండ, దుర్ముహూర్త, గౌరీపంచాంగము, హోర, శుక్రసిద్ధాంత రహిత శుభకాలము. సూర్యోదయ సూర్యాస్తమయములలో గం 6.00 లు ఐనప్పుడు అహః ప్రమాణము గం 12.00 అయినపుడు -

| వారము | శుభకాలము |
|---|---|
| ఆది :- | ఉద 8.24 ల 9.00 వ, 11.00 ల 11.36 వ, మ 2.48 ల 3.00 వ, |
| సోమ:- | ఉ 6.24 ల 7.00 వ, రా 7.36 ల 8.00 వ, రా 8.24 ల 9.00వ, రా 10.00 ల 10.48 వ, రా 2.00 ల 3.00వ, |
| మంగళ:- | సా 5.00 ల 6.00వ, రా 7.36 ల 8.00 వ, తె 5.00 ల 6.00వ, |
| బుధ :- | ఉ 9.36 ల 10.00 వ, మ 2.00 ల3.00 వ సా 4.00ల 5.00వ, రా 7.00 ల 7.30వ, రా 11.00ల 12.00వ, రా 2.00 ల 5.00వ, |
| గురు : - | ఉ 11.00ల 11.36వ, మ 1.00 ల 1.12వ, సా 6.00ల 6.48వ, రా 12.48 ల 1.12వ, తె 3.00ల 3.12వ, |
| శుక్ర :- | ఉ 10.00ల 10.30వ, మ 2.00ల 2.48వ, సా 5.00 ల 5.12వ, సా 5.36ల 6.00వ, రా 10.30 ల 11.00వ, రా 12.00 ల 12.24వ, రా 12.48ల 1.00వ. |
| శని :- | ఉ 11.12 ల 12.48వ, సా 5.12 ల 6.00వ, రా 9.00ల 9.12వ, తె 4.24ల 4.48వ, |

## ముహూర్తము - ప్రాధాన్యత

శుభకరమైన కాలముయొక్క సరియగు స్థితిని తెలుసుకోవడమే ముహూర్తమంటే. అనంతమైన సాగరంలో అమృతబిందువులు ఎలా లభిస్తాయో అటులనే అనంతమైనకాలంలో కూడా అమృతకిరణప్రసారంతో కూడిన కాలాన్ని గణన చేయడమే ముహూర్తమంటే. ఈ ముహూర్తంగురించి శ్రీకాళిదాసు కాలామృతంలో

**వేయి పద్మదళాలు వరుసగాపేర్చి వాటిలో సన్నని బంగారు సువ్వగుచ్చితే ఒక దళంలో ఆ సువ్వగుచ్చుకొనే కాలమెంతో ఆకాలమే ముహూర్తము. ఇటువంటి కాలమును తెలియుట బ్రహ్మకైనా సాధ్యము కాదు. కాని ప్రయత్న పూర్వకముగా ఆసమయమును సాధించుటయే మానవుని ప్రజ్ఞ. అటువంటి ముహూర్తముద్వారా కర్మ విధానాన్ని నవగ్రహముల బలంతో అధిగమించవచ్చును అని.**

ప్రస్తుత కాలంలో ముహూర్తమంటున్నాంగాని ఈ ముహూర్తానికి ఉన్న ప్రాముఖ్యతను గుర్తించడము లేదు. ఒకొక్క ముహూర్తము రెండుగంటల వ్యవధిని కూడా చూపిస్తున్నారు. ఇక పురోహితులు ఏ పంచాంగములో ముహూర్తములు ఎక్కువ ఉంటాయో ఆ పంచాంగమునే అనుసరిస్తూ ముహూర్తముయొక్క ప్రాధాన్యతనుచూచుట లేదు. గ్రహ బలములు, అష్టమశుద్ధి అనేవి అతి ప్రాథమిక సూత్రాలు. అలానే లగ్నములో పాపగ్రహాలున్న ముహూర్తాలు కూడా నిర్ణయిస్తున్నారు. రాహుకేతువులు ఛాయాగ్రహాలు తప్పులేదనే మాటలు కూడా వినిపిస్తున్నాయి. ఫలితభాగంలో మహాదశా ఫలితాలు ఇచ్చే ఛాయాగ్రహాలు ఇక్కడ తప్పుకుంటాయా? గ్రహాలు ఒకచోట ఒకవిధంగాను వేరొకచోట ఫలితం ఇవ్వకుండాను ఉంటాయా? ఒకపర్యాయం పరిశీలించి చూడండి. మీరుపెట్టే ముహూర్తముల ఫలితాలు ఎలా జరిగినవి అనే విషయాన్ని మీరు ఎపుడైనా పరిశీలించారా? కాబట్టి ముహూర్త విషయాలలో తగు జాగ్రత్తలను తీసుకొని ఇతరులకు అపకారము కాని పద్ధతిలో ముహూర్తములను నిర్ణయించి లోక కళ్యాణమును కాంక్షించాలని కోరుతూ !



## లగ్నాంతకాలములకు దేశాంతర చక్రము

| పట్టణములు | మీన | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బెంగుళూరు | +19 | +22 | +24 | +23 | +21 | +18 | +14 | +11 | +09 | +10 | +12 | +15 |
| అనంతపురం | +18 | +20 | +20 | +20 | +19 | +17 | +15 | +13 | +16 | +13 | +14 | +15 |
| కర్నూలు | +16 | +16 | +17 | +16 | +16 | +15 | +14 | +13 | +12 | +05 | +14 | +14 |
| హైదరాబాద్ | +13 | +12 | +12 | +12 | +13 | +13 | +13 | +14 | +14 | +14 | +13 | +13 |
| తిరుపతి | +12 | +14 | +16 | +15 | +13 | +11 | +07 | +05 | +14 | +04 | +06 | +09 |
| నెల్లూరు | +09 | +10 | +11 | +11 | +10 | +08 | +05 | +04 | +03 | +03 | +04 | +06 |
| మదరాసు | +09 | +11 | +14 | +12 | +10 | +07 | +03 | +00 | -01 | +00 | +02 | +05 |
| బందరు | +03 | +03 | +03 | +03 | +03 | +03 | +03 | +02 | +02 | +02 | +01 | +02 |
| విజయవాడ | +05 | +05 | +05 | +05 | +05 | +05 | +04 | +04 | +04 | +04 | +04 | +04 |
| విజయనగరం | -06 | -08 | -08 | -08 | -07 | -06 | -04 | -04 | -03 | -02 | -02 | -05 |

**గమనిక :** పంచాంగమునందు చూపబడిన సమయములు భారతదేశమధ్యమమునకు నిశ్చయింపబడినవి. వివిధ పట్టణముల లగ్నాంతకాలములు కావలసినవారు పట్టికలో తెలిపిన విధంగా సవరించుకొనవలెను.

